Photo by S. H. Kotak



బహుమతి
పొందిన వ్యాఖ్య

బందీలో విందుకన్నా....

పంపినవారు :
కె. ఎస్. ఎన్. మూర్తి - మద్రాసు






# జానకి లక్స్

## టాయ్‌లెట్ సబ్బును వాడుచున్నది

"అది నాకు తెలిసియున్నట్టి అతి తెల్లని. అతి శుద్ధమైన సబ్బు"

చలన చిత్రములందు విజయమును నిలుపుకొనుటకు కేవలం ఫిలుములందు పని చేయుటే చాలదు అని జానకి ఎరుగును. ఉదాహరణకు, ఆమె తన కోమలమైన చర్మ సౌందర్యముపట్ల చాల శ్రద్ధవహించును. ఆమె ఎల్లప్పుడూ లక్స్ టాయ్‌లెట్ సబ్బును వాడుటవల్ల దాని మనోహరత్వమును నిలుపుకొనును.

ఎంతో తెల్లనిది, ఎంతో శుద్ధమైనది — లక్స్ టాయ్‌లెట్ సబ్బు రూఢిగా చర్మ సౌందర్యమును కాపాడునట్టిది.

అతి సుందరమైన సినీమా తారలు దీనినే వాడుదురు. కనుక మీరున్నూ వాడుడు!

# లక్స్ టాయ్‌లెట్ సబ్బు

సినీమా తారలకు సౌందర్యమునిచ్చు సబ్బు

LTS. 514-50 TL

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక చిత్రకథ, ఫోటో శీర్షికల పోటీ, వార్తలు - విశేషాలు,
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.


చందమామ (అన్ని భాషలలో)
విడి కాపీ **50** నయా పైసాలు. (**8** అణాలు)
సాలు చందా రు **6** లు.

# రవి టాయ్‌లెట్సును వాడండి

## రవి గ్లిసరిన్ సోపు:
మీ అందమును వర్చస్సును కాపాడును.

## రవి వెజిటబుల్ హెరాయిల్:
మీ కేశములను విరివిగా పెంపొందించును.




## రవి స్నో:
మీ ముఖవిలాసమును అభివృద్ధి చేయును.

సోల్ ఏజంట్లు:

**ది న్యూ స్టార్ & కంపెని,**

తండియార్పేట :: మద్రాసు-21

---

*ఇదుగో! నీ*

# అశోకా



## అశోకా పెన్ వర్క్సు తెనాలి ఆంధ్ర

"మీరు కూడా మీ బట్టలకు టినోపాల్
ఉపయోగిస్తున్నారని తెలుస్తోంది"





తెల్లని బట్టలు ప్రకాశించేలా తెల్లబడేటట్లు, చేయాలంటే, దానికి సరియైన మార్గం "టినోపాల్", కొద్దిగా టినోపాల్, ఒక్కసారి ఉపయోగించితే మూడు నాలుగు ఉతుకులవరకూ చాలుతుంది.

# టినోపాల్



"టినోపాల్" జె. ఆర్. గాయిగి యస్. ఏ. బాల్. స్విట్జర్లాండ్ వారి ట్రేడ్‌మార్కు.

అమాల్గమేటెడ్ కెమికల్స్ అండ్ డైస్టఫ్స్ కంపెనీ, ప్రైవేట్ లిమిటెడ్.
పోస్టు బాక్సు నం. 965 - బొంబాయి.

SISTA'S - AML - 32 - TEL




రిజిస్టర్డు నం: 119923

## డైమండ్ సుగంధవక్క పొడి

### ఉపయోగించువారికి గమనిక

మా 'డైమండ్' మార్కు సుగంధవక్కపొడి అతి రుచికరమైనది, అన్ని విధాలా మిక్కిలి ప్రసిద్ధిచెందినదిన్నీ. మీరు ఈసారి వక్కపొడి కొనేటప్పుడు—"మాకు 'డైమండ్' మార్కు సుగంధవక్కపొడి కావాలి. అదే ఇవ్వండి. ఇతరములు ఏవీ వద్దు" అని కచ్చితంగా చెప్పి, అడగండి.

## ది డి. పి. అండ్ కంపెని,

### కౌల్ బజార్ - బళ్ళారి - 1.

: సేల్సు డిపోలు :

చీరాల - గుంటూరు - కర్నూలు - ఆదోని - హుబ్లి.

# ఇప్పుడు

## కొ త్త ర క పు

# టాయిలెట్ పౌడరు

## ఎల్లవేళలందును హాయిగా నుంచుటకు

భారతదేశమందు ప్రప్రథమంగా, లోకప్రసిద్ధమైన **జి-11**※ తో గూడినట్టి అతిసున్నితమైన టాల్కమ్ పౌడరు తయారుచేయబడినది....జి-11 చర్మ మచ్చలను అత్యధిక చమటను గలిగించు క్రిములను నాశనమొనర్చునట్టి ఒక్కటే ధృవపడిన మంట బెట్టని రసాయనము. ఈ అద్భుతమైన పౌడరు చర్మము తడివల్ల రేగుట, వేడికి పేలుట ఈ బాధలనుండి శాశ్వతమైన శీఘ్రవిముక్తిని గలిగించును..... ఎల్లప్పుడూ, పనికి, ఆటలకు, షికారుకు, విందులకు వెళ్లేముందు ఈ శమనకరమైన, మనోహరమగు పరిమళము గల పౌడరును బాగా అద్దుకొనుడు....మీరు మిగుల నమ్మికగా నుందురు, చాలా ప్రీతికరముగా నుండుడు! బట్టలయందు జల్లబడేయడల, అది రాపిడిని నిరోధించును.

Godrej రిజిస్టర్డ్ జి-11 తో గూడిన

# గోద్రెజ్ టాయిలెట్ పౌడరు




**జి-11** తో కూడిన
హెయిర్ టానిక్కు
షేవింగ్ స్టిక్కు
సింతాల్

※ వైజ్ఞానిక గ్రంధ జాబితాతో గూడిన **జి-11** గాథ (హెక్సాక్లోరోఫీన్) కొరకు, దిగువ చిరునామాకు వ్రాయుడు. గోద్రెజ్ సోప్స్ ప్రయివేట్ లిమిటెడ్, బొంబాయి-11.



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

అసూయాపరుడు మూఢుడిలాగా ప్రవర్తిస్తాడు. వాడికి
ఆత్మజ్ఞానం ఉండదు, విచక్షణాశక్తి కూడా ఉండదు. తన
తాహతుకు మించిన పదవి దొరికినాకూడా ఇంకా పెద్దపదవి
రానందుకు బాధపడతాడు. మనిషి పైకి రావటానికి తోడ్పడే
పరిస్థితుల నన్నిటినీ అర్థంచేసుకోలేడు. నీచంగా ప్రవర్తించి
తనకు దక్కిన అధికారాన్నికూడా పోగొట్టుకునే దశకు వస్తాడు.

"అసూయ" [జాతక కథ]లో శాఖుడు అసూయతో బాధ
పడతాడు. వాడు తన సహవాసి అయిన పోత్రికుడికి ఎన్నడూ
చిన్నమెత్తు ఉపకారం చేసిన పాపాన పోకపోయినా, పోత్రికుడు
కోడికొవ్వును తన కివ్వనందుకు పగబట్టుతాడు. నిజానికి పోత్రి
కుడు స్వార్థరహితుడు. అతను కోడికొవ్వునుగాని, గుండెకాయను
గాని తాను తినలేదు; శాఖుణ్ణి తనకన్న ఎక్కువగానే చూసు
కున్నాడు. అదీకాక, కాశీరాజ్యాభిషేకానికి అర్హుడెవరో నిర్ణయించిన
వాడు రాజపురోహితుడు. నిగ్రోధుడి పాదాలలో రాజలక్షణాలున్నాయి.
అయినా శాఖుడు పోత్రికుడిమీదనే పగబట్టుతాడు. చిత్రమేమిటంటే
శాఖుడి సేనాపతిపదవి కాస్తా పోయే సమయంలో పోత్రికుడే దానిని
రక్షించటం జరుగుతుంది !

సంచిక 6
జూన్ 1957
సంపుటి 20

# అట్టవీం దిబొమ్మ

పాండవులూ, ద్రౌపదీ విరాటరాజువద్ద కొలువుచేస్తూ, తమ అజ్ఞాతవాసదీక్ష పది నెలలపాటు సాగించారు. ఈ దీక్ష మరి రెండు మాసాలు జరగవలసి ఉన్నది. ఈ సమయంలో సుదేష్ణ తమ్ముడైన కీచకుడు ద్రౌపదిని చూడటం తటస్థించింది.

విరాటరాజుకు సేనానాయకుడుగా ఉంటున్న ఈ కీచకుడు మహా బలశాలి, గొప్పగర్వి. ద్రౌపదిని చూస్తూనే అతను ఆమెను మోహించాడు. అతను నిర్భయంగా అంతఃపురంలో ప్రవేశించి ద్రౌపదిని సమీపించి, "ఎవరునీవు? నీవంటి సౌదర్యవతిని నేనెక్కడా చూడలేదు. నీకు ఇక్కడ దాసీ పనిచేసే కర్మమేమిటి? నన్ను పెళ్లాడి నారాణివిగా ఉండు. నేనూ, నా ఇతర భార్యలూ నీకు దాసానుదాసులుగా ఉంటాము!" అన్నాడు.

"నేను పరస్త్రీని. నాతో నీకేమిపని? నీబుద్ధి మార్చుకో. లేనిపక్షంలో నా భర్తలయిన గంధర్వులయిదుగురు నిన్ను హతమార్చెయ్యగలరు!" అని ద్రౌపది కీచకుణ్ణి బెదిరించింది.

కీచకుడు భయపడక, "నన్ను హతమార్చగలవాళ్లు మూడులోకాలలోనూ లేరు. ఈ విరాటరాజును సింహాసనంమీదవుంచి కాపాడుతున్నది నేనే. కనుక, నా కోరిక మన్నించి నన్ను పెళ్ళాడు!" అన్నాడు.

"పాపీ, నీకు ఆయుర్దాయం తీరినట్టుగా ఉన్నది. నీకు ఇటువంటి ఆలోచన ఉన్నదని తెలిస్తే చాలు నా భర్తలు నిన్ను చంపేస్తారు. నీ బల పరాక్రమాలు వారిముందు ఎందుకూ పనికిరావు!" అని ద్రౌపది హెచ్చరించింది.

ద్రౌపది బుద్ధిమార్చలేక కీచకుడు తన అక్క అయిన సుధేష్ణ కాళ్ళమీద పడి, "అక్కా; ఈ సైరంధ్రి నన్ను పెళ్ళాడకపోతే నా ప్రాణాలు దక్కవు, ఎలాగైనా ఆమెను నాకు సుముఖురాలినిచేసి పుణ్యంకట్టుకో," అన్నాడు.

సుధేష్ణ అతనిబుద్ధి మరల్చాలని ప్రయత్నించింది గాని, కీచకుడి బుద్ధి కొంచెమైనా మారలేదు. చివరకామె, "నీకు రోజులు మంచివికావు! దానికి నేనేం చెయ్యగలను? నీవు ఇంటికిపోయి మద్యమూ, మధురాన్నమూ తయారు చేయించు. వాటికోసం సైరంధ్రిని పంపుతాను. చాతనైతే ఆమెను సుముఖు రాలినిచేసుకో, లేకపోతే నీకర్మ నువే అనుభవించు!" అన్నది.

కీచకుడు పరమానందంతో ఇంటికి వెళ్లిపోయాడు.




బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో రాజగృహనగరంలో ఒక ధనికు డైన వర్తకుడి కుమారుడుండేవాడు. అత నికి వివాహం అయిందిగాని భార్యకు సంతానం లేకపోయింది.

వైశ్యకుమారుడి భార్యను అత్తవారు రానురాను చులకనగా చూడసాగారు. ఒకనాడు తన అత్తవారు తమలో తాము మాట్లాడకుంటూ, "దీని ముఖాన పిల్లలగీత లేదు! పట్టి గొడ్రాలు!" అనుకోవటం ఆమె విన్నది. పోయిన గౌరవం తిరిగి తెచ్చుకోవ టానికామె తన అత్తవారితో తాను గర్భ వతిగా ఉన్నట్టు చెప్పేసింది.

తరవాత ఆమె తన పరిచారిక నడిగి గర్భిణీ స్త్రీల లక్షణాలు తెలుసుకుని, వేవిళ్లు నటిస్తూ తినటానికి పుల్లటి పదా ర్థాలూ, విడ్డూరమైన పదార్థాలూ కోర సాగింది. నడుముకు గుడ్డలుచుట్టుకుని కడుపు పెరుగుతున్నట్టు ప్రదర్శించింది. ఇదంతా చూసి అత్తవారు తమ కోడలికి నిజంగా గర్భమే ననుకుని, అనాటినుంచి ఆమెను చాలా ఆదరాభిమానాలతో చూడ నారంభించారు.

కొన్ని మాసాలు గడిచాక ఆమె తన భర్తతో, "పురుడు పోసుకోవటానికి నన్ను మా పుట్టింటికి పంపండి!" అన్నది. ఆమెభర్త ఆమె కొక బండీ ఏర్పాటుచేసి, ఆమెవెంట బోలెడుమంది నౌకర్లనూ, చాక ర్లనూ ఇచ్చి పంపాడు.

ప్రయాణం మధ్య ఒకనాటి ఉదయం ఆమె కాలకృత్యాలు నిర్వర్తించుకునే టందుకుగాను ఒంటరిగా, దారి పక్కనే ఉండే చెట్లమధ్యకు పోయింది. అప్పుడు ఒక జువ్విచెట్టుకింద ఆమెకు పొత్తిళ్లలో ఉన్న ఒక అందమైన మగ శిశువు కనిపిం చాడు. కొద్ది గడియల క్రితమే ఆదారిగా ఒక



బిడారు వెళ్లింది. ఆ బిడారువెంట ఉండిన ఒక పేద స్త్రీ ఈ చెట్టుకిందనే ఆ బిడ్డను ప్రసవించి, పెంచి పోషించలేని కారణంచేత అక్కడే వదలి ముందుకు సాగిపోయింది. ఆ శిశువే బోధిసత్వుడు.

బంగారు శరీరచ్ఛాయతో వెలిగిపోయే ఆ బిడ్డను చూడగానే వైశ్య స్త్రీకి పరమానందం కలిగింది. ఆమె తన పరిచారికను కేక వేసి పిలిచి, బిడ్డను చూపి, "ఈ బిడ్డ నాకు పుట్టిన బిడ్డే అంటాను. నువు నాకు పురుడు పోసినట్టు అందరితోనూ చెప్పు!" అన్నది.

తరవాత ఆమె తన నడుముచుట్టూ చుట్టుకున్న గుడ్డలన్నిటినీ తీసిపారేసి,



బిడ్డను ఎత్తుకొని బండివద్దకు తిరిగివచ్చింది. అది ఆమె కనిన బిడ్డేనని అందరూ నమ్మారు. తాను బయలుదేరిన పని, దారిలోనే అయిపోయింది గనక వైశ్యుల కోడలు తిరుగు ప్రయాణం చేసి అత్తవారింటికి వచ్చేసింది. అందరూ సంతోషించారు. పిల్లవాడికి న్యగ్రోధకుమారుడని పేరుపెట్టి అల్లారుముద్దుగా పెంచసాగారు.

న్యగ్రోధ కుమారుడు పుట్టినరోజునే రాజగృహ నగరంలో మరొక వర్తకుడికి శాఖాకుమారుడనేవాడూ, ఒక దర్జీవాడికి పోత్రికుడనే పిల్లవాడూ కలిగారు. ఆ కారణంచేత ఈ ముగ్గురు పిల్లలనూ ఒక చోటే ఉంచి జాగ్రత్తగా పెంచారు.

చదువుకొనటానికి వెళ్లేటప్పుడుకూడా ముగ్గురూ కలిసే బయలుదేరి తక్షశిలకు వెళ్లి అక్కడ చదువు పూర్తిచేశారు. అక్కడ ఉన్నంత కాలమూ పోత్రికుడి ఖర్చులన్నీ న్యగ్రోధుడే భరించాడు.

తక్షశిలలో చదువు పూర్తి కాగానే వారు తమ గురువువద్ద శలవు పుచ్చుకొని, దేశం చూస్తూ కాలినడకను ప్రయాణం సాగించి కొంతకాలానికి కాశీనగరం చేరారు. వారు నగరం ప్రవేశించే లోపుగా పొద్దూకింది. ఆ రాత్రికి వారు ఒక ఆలయం సమీపంలో



ఉన్న ఒక చెట్టుకింద పడుకుని నిద్ర పోయారు. పోత్రికుడు తూర్పు తెల్లవారక ముందే లేచి, ఇంకా నిద్రపోతున్న నిగ్రో ధుడి కాళ్లు ఒత్త నారంభించాడు. ఆ సమ యంలో ఒక చిత్రం జరిగింది.

అదే చెట్టుకొమ్మలలో రెండు కోళ్లు కూచుని ఉన్నాయి. వాటిలో పైకొమ్మ మీద కూచుని ఉన్న కోడి కింది కొమ్మ మీద ఉన్నదానిపై రెట్టవేసింది. రెండవ కోడికి ఆగ్రహం వచ్చి, "నీ కింత పొగరా? నే నెవరో తెలుసుకోకుండా ఇంత అవమానం చేస్తావా? నేను అన్ని కోళ్లలాంటిదాన్ని కాను, తెలుసా? నన్ను తిన్నవాడు పదివేల వరహాలు సంపాదిస్తాడు, ఏమనుకున్నావు?" అని ప్రగల్భాలు పలికింది.

దానికి పైకొమ్మ మీద ఉన్న కోడి, "నేను కూడా సామాన్యమైన కోడిని కానులే! నా కొవ్వు తిన్నవాడు రాజవుతాడు, నా గుండె కాయ తిన్నవాడు సేనాపతి అవుతాడు, నా ఎముకలమీది మాంసం తిన్నవాడు కోశాధి పతి అవుతాడు," అన్నది.

ఈ మాటలువిని పోత్రికుడు చెట్టెక్కి పైకొమ్మమీద ఉండిన కోడిని పట్టుకుని, చంపి, వండాడు. తన మిత్రులిద్దరూ లేచి నాక వారిలో నిగ్రోధుడికి కోడికొవ్వూ, శాఖు



డికి గుండెకాయా పెట్టి, తాను ఎముకల మీది మాంసం తిన్నాడు. తరవాత అతను తన మిత్రులతో జరిగినదంతా చెప్పి, "మనలో నిగ్రోధుడు రాజవుతాడు, శాఖుడు సేనాపతి అవుతాడు, నేను కోశాధిపతి నవు తాను!" అన్నాడు.

తరవాత వారు కాశీనగరం ప్రవేశించారు. అప్పటికి వారంరోజుల క్రితమే కాశీ రాజు చనిపోయాడు. ఆయనకు పిల్లలులేరు. కొత్తరాజు ఎన్నిక జరుగుతుందని చాటింపు కూడా వేశారు.

ఈ సంగతి ముగ్గురు మిత్రులు ఎరగరు. వారు ఆరోజు మధ్యాన్నం ఒక బ్రాహ్మణ



గృహంలో భోజనంచేసి అక్కడినుండి రాజోద్యానానికి వెళ్లి అక్కడ నీడపట్టున పడుకుని నిద్రపోయారు.

వారిలా నిద్రపోయే సమయంలో ఒక రథంమీద రాజలాంఛనాలైన కత్తీ, పాద రక్షలూ, కిరీటమూ, ఛత్ర చామరాలూ ఉంచి మంత్రి పురోహితులు మొదలైనవారు అటుగా వచ్చారు. ముగ్గురు మిత్రులూ నిద్రపోయే రాజోద్యాన ప్రాంతానికి వచ్చి రథం ఆగిపోయింది.

పురోహితుడు రథం దిగివచ్చి ముగ్గురు నిద్రపోతూ ఉండటం చూశాడు. అయన వారి అరికాళ్లు పరీక్షించి వారి ముగ్గురి లోనూ ఒకడికి మాత్రమే అరికాలిలో చక్రం ఉండటం గమనించి, అతనే రాజని నిర్ణయించాడు. పురోహితుడిచేత రాజుగా నిర్ణయించబడినవాడు నిగ్రోధుడు.

ఈ విధంగా నిర్ణయించినవాడై పురోహితుడు బాజాభజంత్రీలను మంగళ వాద్యాలు చేయమని ఉత్తరువిచ్చాడు. ఆ చప్పుడుకు ముగ్గురు మిత్రులూ లేచి కూచున్నారు. వారికి చుట్టూఉన్న జన సమూహం కనిపించింది. తాను కాశీ నగ రానికి రాజుగా ఎన్నిక అయినట్టు నిగ్రోధుడు తెలుసు కున్నాడు. వెంటనే అతను శాఖుణ్ణి సేనాపతిగా నియమించాడు.



ఈ సంఘటన జరిగిన వెంటనే న్యగ్రోధుడు శాఖుడితో, "మనం ఇక్కడ పెద్ద పదవులు సంపాదించాము గనక, మన తల్లి దండ్రులు ఇక్కడికి వస్తే మనతోపాటు సుఖంగా ఉండవచ్చు. నువువెళ్లి మన ముగ్గురి తల్లిదండ్రులనూ తీసుకు వస్తావా?" అని అడిగాడు.

"ఇటువంటి పనికి నేనా వెళ్లటం? నా గౌరవానికి తగదు. నేను వెళ్లను!" అన్నాడు శాఖుడు.

అందుచేత న్యగ్రోధుడు ఈ పనికి పోత్రికుణ్ణి నియమించాడు. పోత్రికుడు బయలుదేరి రాజగృహ నగరానికి వెళ్లాడు గాని, అతని వెంట రావటానికి ఎవరి తలిదండ్రులూ ఒప్పుకోలేదు.

"మాకిక్కడే సుఖంగా ఉన్నది," అని వారు చెప్పారు.

పోత్రికుడు తిరుగు ప్రయాణంచేసి కాశీ నగరం చేరుకుని భోజనంచేసి విశ్రాంతి తీసుకుందామనే ఉద్దేశంతో శాఖుడి ఇంటికి వెళ్లాడు. "నేను శాఖుడి మిత్రుణ్ణి. నేను వచ్చినట్టు అతనితో చెప్పండి," అని వాకిట్లో ఉన్న నౌకరుతో అన్నాడు.

పోత్రికుడు తన మిత్రుడినని చెప్పుకున్నట్టు వినగానే శాఖుడికి మండిపోయింది. కోడికొవ్వు తనకివ్వక న్యగ్రోధుడి కిచ్చినం



దుకు పోత్రికుడిమీద అతనికి చాలా రోజులుగా కచ్చగా ఉన్నది.

"ఆ వెధవను చితకదన్ని బయటికి గెంటెయ్యండి!" అని అతను నౌకర్లతో చెప్పాడు. వాళ్లు ఆ ప్రకారమే చేశారు.

తీరా పోత్రికుణ్ణి కొట్టించినాక, వాడువెళ్లి తనమీద న్యగ్రోధుడికి ఫిర్యాదు చేస్తాడేమోనని శాఖుడికి భయం పట్టుకున్నది. అందుచేత అతడు వెంటనే న్యగ్రోధుడి దగ్గిరికి బయలు దేరాడు. తాను ఎదురుగా ఉండగా తనమీద ఫిర్యాదు చెయ్యటానికి పోత్రికుడు జంకుతాడని అతని ఉద్దేశం.

కాని శాఖుడు వెళ్లేసరికి పోత్రికుడుకూడా రాజువద్దకు రానే వచ్చాడు. శాఖుడు వింటూండగానే పోత్రికుడు జరిగిన సంగతి న్యగ్రోధుడితో చెప్పాడు. శాఖుడిపైన న్యగ్రోధుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది.

"పోత్రికుడు స్వార్థంలేనివాడు. నువు అతనికి జన్మలో ఏ మాత్రమూ మేలు చెయ్యకపోయినా, అతను నిన్ను సేనాపతిని చెయ్యాలని కోడి గుండెకాయ నీ కిచ్చాడు. దానికి నువు కృతజ్ఞత చూపకపోగా అతన్ని అకారణంగా నీ నౌకర్లచేత కొట్టించావు. నీ వంటి కృతఘ్నుడు సేనాపతిగా ఉండ తగడు. నిన్ను ఆ పదవినుంచి తొలగిస్తాను," అన్నాడు న్యగ్రోధుడు.

పోత్రికుడు అడ్డుపడి, "మిత్రమా, మనం ముగ్గురమూ అబాల్యస్నేహితులం. ఒకరి తప్పులు ఒకరు సహించటం మన ధర్మం. ఇతనిని సేనాపతిగా ఉండనీ!" అని ప్రాధేయ పడ్డాడు.

న్యగ్రోధుడు శాఖుణ్ణి కనికరించి విడిచి పెట్టాడు. తరవాత అతను పోత్రికుణ్ణి తన కోశాధికారిగా నియమించాడు. ఆ పదవి ఏర్పడటానికి అదే మొదలు. అంతకు పూర్వం రాజులవద్ద కోశాధికారు లుండేవారు కారు. ఈ కారణంవల్ల పోత్రికుడే ప్రపంచంలో మొదటి కోశాధికారి.






6

[పద్మపాదుడూ, పింగళుడూ భల్లూకపర్వాతాల లోయలో గల నది వద్దకు వెళ్లారు. నదీ జలాన్ని యింకింపజేసేందుకు, పద్మపాదుడు సమాధినిష్ఠలో మంత్రం జపిస్తూండగా, పింగళుడు గద చేబూని, అతడికి రక్షణగా వున్నాడు. నదీజలం యింకిపోయింది. అందులోనుంచి, పాడుబడిన దేవాలయ శిఖరం బయటపడింది. తరవాత—]

పద్మపాదుడు, దేవాలయ శిఖరంకేసి కొంతసేపు పరీక్షగా చూసి, దాని పక్కనే నిలబడివున్న మహామాయుడి శిష్యులను దగ్గరకు రావలసిందిగా చేయి వూపాడు. మహామాయుడి శిష్యులిద్దరూ తృటికాలంలో, పద్మపాదుడిని సమీపించి, అతడికి వంగి నమస్కరించారు.

"మీరు నా ఆజ్ఞను శిరసావహించినందుకు, నాకు చాలా సంతోషంగా వుంది. ప్రస్తుతానికి మీ యిష్టం వచ్చిన చోటుకు వెళ్లవచ్చు," అన్నాడు పద్మపాదుడు.

మహామాయుడి శిష్యులు ముఖముఖాలు చూచుకున్నారు. వారిలో ఒకడు ధైర్యం తెచ్చుకుని, "మహామాంత్రికా! దయతో, మా విన్నపం ఆలించవలసిందిగా ప్రార్థిస్తున్నాము. మావల్ల మీకు కావలసిన సహాయం అయిపోయింది. ఇకనైనా మమ్మల్ని, మంత్రవిముక్తుల్ని చేయరాదా?" అని అడిగాడు.

"నే వచ్చిన పని నెరవేరందే, మిమ్మల్ని మంత్రవిముక్తుల్ని చేయుటమా?" అంటూ పద్మపాదుడు బిగ్గరగా నవ్వి, "మీరు,




మామూలు పిశాచాలు కాదనీ—మహాదుష్ట, క్రూర పిశాచగణానికి చెందిన వారనీ నాకు తెలుసు! కనుక, మీ గురువు సమాధినుంచి, నాకు కావలసినవి, నేను సంగ్రహించందే, మిమ్మల్ని మంత్రవిముక్తుల్ని చేయటమనే ఆలోచనే లేదు," అన్నాడు.

పద్మపాదుడి మాటలు వింటూనే, మహామాయుడి శిష్యులిద్దరూ వెలవెలపోయారు. తరవాత వాళ్లిద్దరూ, పద్మపాదుడికి సాష్టాంగ పడి, "మహామాంత్రికా! మేము మీకు దాసానదాసులం! మంత్రబలంతో మీరు మమ్మల్ని బంధించిననాటినుండి, మాకు కడుపునిండా ఆహారమే లేదు. మేము శక్తిహీనులమై పోయాం!" అంటూ విలపించసాగారు.

పింగళుడికి, వాళ్లిద్దరిమీదా ఎంతో జాలి కలిగింది. అతడు పద్మపాదుడికేసి తిరిగి, "పద్మపాదా!" అంటూ ఏమో చెప్పబోయేంతలో, పద్మపాదుడు అతణ్ణి వారించి, మహామాయుడి శిష్యులతో యిలా అన్నాడు:

"మీరు, యింతకాలంగా ఆహారం లేక వుపవాసాలు చేస్తున్నారని నాకు తెలుసు. మీకు వేటాడే శక్తిలాటిది గనక, నేను ప్రసాదిస్తే—అ మరుక్షణం, మీరు నన్నే వేటాడి చంపేందుకు ప్రయత్నిస్తారు! అవునా?"

"మహామాంత్రికులైన మిమ్మల్ని, క్షుద్రులమైన మేము, వేటాడటమా?" అంటూ, మహామాయుడి శిష్యులు దీనాతి దీనంగా ముఖం పెట్టారు.

పద్మపాదుడు నవ్వాడు. తరవాత, పింగళుడి చేతిలోంచి మంత్రశక్తి గల గద తీసుకుని, "మీ యిద్దరికీ, ప్రస్తుతానికి మానవులను తప్ప, మరి దేనినైనా చంపి తినగల శక్తి యిస్తున్నాను. మీకు ఎలాంటి రూపాలు కావాలని వుంది?" అని అడిగాడు.

"పద్మపాదా! వాళ్లను ఏనుగులుగా మార్చండి. ఆ కనబడే అడవిలో నిర్భయంగా బ్రతకగలరు," అన్నాడు పింగళుడు.



"ఏనుగు రూపాలా? మహామాంత్రికా వద్దు, వద్దు!" అంటూ మహామాయుడి శిష్యులిద్దరూ ఏక కంఠంతో అరిచారు. "ఆ రూపాల్లో మేము ఆకూ అలములూ తప్ప మాంసాహారం తినేందుకు అవకాశం లేదు! మాకు శాకాహారం పడదు; అది మా దేహాలకు విషతుల్యం!"

"అలా అయితే, మీలో ఒకరిని సింహం గానూ..." అంటూ పద్మపాదుడు, మహా మాయుడి శిష్యుల్లో ఒకడి నెత్తిమీద గదతో మోదాడు. మరుక్షణంలోనే వాడు సింహంగా మారిపోయాడు. "...మరొకణ్ణి పెద్దపులి గానూ, మారుస్తున్నాను!" అని పద్మ పాదుడు, రెండవవాడి తలమీద గదతో బాదాడు. వాడు వెంటనే పులిగా మారాడు.

పింగళుడు, ఓ తృటికాలం వాళ్లిద్దరికేసీ ఆశ్చర్యంగా చూసి, "ఇక మీకు కావలసి నంత మాంసాహారం! ఆ కనబడే అడవికి పొండి!" అంటూ, సింహాన్నీ, పెద్దపులినీ వీపులమీద తట్టాడు. వెంటనే క్రూరమృగాల రూపంలో వున్న మహామాయుడి శిష్యు లిద్దరూ, భీకరంగా గర్జిస్తూ, దాపులనేవున్న అడవికేసి పరిగెత్తారు.

పద్మపాదుడు, మహామాయుడి శిష్యుల కేసి కొద్దిసేపు చూసి, పింగళుడికేసి తిరు



గుతూ, "పింగళా! మనం ఎంతో మెలు కువగా వుండవలసివుంది! మన ప్రయత్నాన్ని విఫలం చేసేందుకే కాక, వీలయితే మన లను సంహరించేందుకూ్కడా, అనేక దుష్ట శక్తులు ప్రయత్నిస్తున్నవి. సరే, ఇక మన పని చూద్దాం! ఆ పాడుదేవళపు శిఖరం, నీకు స్పష్టంగా కనబడుతున్నది గదా?" అని అడిగాడు. పింగళుడు అవునన్నట్టు తల వూపి, ఆ దిక్కుకేసి చూశాడు.

"అయితే, నువ్విప్పుడా దేవళంలోని, మహామాయుడి సమాధిని చేరవలసివుంది. ఆ సమాధిలో నువ్వు ప్రవేశించే ముందు, నువ్వు దాటవలసిన ద్వారాల సంఖ్య అరు.





ఆ ఆరు ద్వారాలకూ రక్షకులుగా మహా భయంకరులైన మాయా రక్కసులు వున్నారు. వారిలో ప్రతిఒక్కరూ నిన్ను సంహరించేందుకు ప్రయత్నిస్తారు. నువ్వు వాళ్లను చూచి, ఏమాత్రం వెరపు కనబరిచినా, మన ప్రయత్నం వమ్ము కావటమే గాక, ప్రాణాపాయం కలిగే ప్రమాదంకూడా వుంది," అన్నాడు పద్మపాదుడు.

పింగళుడు జవాబివ్వలేదు. అతడి దృష్టి నదీగర్భాన గల పాడుదేవళంమీదనే వుంది. పద్మపాదుడు, అతడికేసి ఓమారు చూచి, "పింగళా, యిక మనం దేవళం దగ్గిరకు వెళదాం. దానికి గల ఆరు ద్వారాలలోనూ



మొదటి ద్వారంవరకూ నేను రాగలను. ఆ ద్వారాన్ని నువ్వు తెరుచుకున్న తరవాత, తక్కిన అయిదు ద్వారాలనుకూడా తెరుచుకుని, మహామాయుడి సమాధిలో ప్రవేశించవలసినవాడివి, నీవు!" అన్నాడు.

పద్మపాదుడూ, పింగళుడూ ఒక్క చుక్క నీరైనా లేకుండా యింకిపోయిన, నదీగర్భంలోనుంచి నడిచి, పాడుదేవళాన్ని సమీపించారు. దేవళానికి వున్న మొదటి ద్వారం, చూపరులకు చాలా భయంకొల్పుతున్నది. పెద్ద దేవదారుచెక్కతో చేయబడిన తలుపులపై అనేక భయంకరాకృతులు చెక్కబడినై. రెండు తలుపులలోనూ బిగించబడిన, రెండు పెద్ద మేకులకు చుట్టుకుని, ఒక సర్పం పడగవిప్పి బుసలుకొడుతున్నది.

పద్మపాదుడు, ఆ సర్పంకేసి చేయి చూపుతూ, "పింగళా, నువ్వు నిర్భయంగా ఆ సర్పాన్ని సమీపించి, దానిని రెండుసార్లు నీ చేతితో తాకవలసివుంది. ఆ తరవాత ద్వారం లోపలినుంచి, ఒక భీకరాకారం నిన్ను ప్రశ్నిస్తుంది. నువ్వు ఎవరివైనదీ నిర్భయంగా చెప్పిన తరవాత ద్వారం తెరుచుకుంటుంది. కాని...ఆ తరవాత ఏం జరగబోయేదీ నీకు చెప్పటమంటే





—నేను నా మంత్రశక్తిని కోల్పోవటమే నన్నమాట! కనుక, నువ్వు దేనికీ భయపడకుండావుంటే, అన్ని ద్వారాలూ తెరుచుకుని, మహామాయుడి సమాధిలో అడుగుపెట్టే అవకాశం కలుగుతుంది. అక్కడి అపూర్వ వస్తువుల సంగతి తెలుసుగదా?'' అన్నాడు.

"పద్మపాదా! నేను ఎటువంటి భీకర శక్తికీ భయపడను. కాని, మోసం చేసి నన్ను హతమార్చ చూచే దుష్టశక్తు లేమీ, యీ పాడుదేవళంలో లేవు గదా?'' అని ప్రశ్నించాడు పింగళుడు.

"కావాలనుకుంటే నిన్ను మోసగించకుండానే, యీ దేవళంలో వున్న శక్తులు నిన్ను హతమార్చగలవు. కాని, నీవు ఏమాత్రం భయపడకుండా ముందుకు వెళ్లినప్పుడు అవి నిన్ను ఏమీ చెయ్యలేవు. మహామాయుడి సమాధినుంచి, నువ్వు మనకు కావలసిన వస్తువులు సంపాయించిననాడు, నీకన్న యీ ప్రపంచంలో శక్తిమంతుడూ ధనవంతుడూ మరొకడుండడు,'' అన్నాడు పద్మపాదుడు.

"అందుకోసమేగదా, నేనిన్ని ప్రమాదాలకు ఎదురీదేందుకు సిద్ధమయాను!'' అంటూ పింగళుడు ముందుకు నడిచాడు. అదే సమయంలో పద్మపాదుడు వెనుదిరిగి,




లోగడ తను సమాధినిష్ఠలో వుండి మంత్రం జపించిన చోటుకు వచ్చాడు.

పింగళుడు నిర్భయంగా ద్వారాన్ని సమీపించి, పడగ విప్పి బుసలుకొడుతూవున్న సర్పాన్ని, తన కుడిచేతితో రెండుసార్లు తాకాడు. అంత భయంకరసర్పమూ తల వంచి కదలామెదలక వూరుకున్నది. కాని, అదే క్షణాన తలుపుల వెనక భూమి దద్దరిల్లేలా కర్ణకఠోరమైన ధ్వనితో ఒక కర్కశ కంఠం యిలా ప్రశ్నించింది :

"లోపలకు రావటం ఎలాగో తెలియకుండానే, మహామాయుడి సమాధి ప్రథమ ద్వారాన్ని సమీపించిన పిరికిపంద ఎవడు?''






"నా పేరు పింగళుడు! నేను అవంతీ నగరపు జాలరిని! నా గురువు పద్మపాదుడు..."

"చాలు, చాలు! నీ గురువు ఎవరన్నది, నాకవసరంలేదు. నీవు జాలరి పింగళుడివి! ఇదిగో తలుపు తెరుస్తున్నాను!" అన్నశబ్దం అయింది. మరుక్షణాన తలుపులు రెండూ బార్లా తెరుచుకున్నవి. పర్వతాకారంలో వున్న నల్లనివాడొకడు తళతళలాడే కత్తి చేబట్టి, ద్వారానికి అడ్డంగా నిలబడ్డాడు. పింగళుడు ముందుకు నడిచాడు.

సరిగా కత్తివేటుకు అందే దూరంలోకి పింగళుడు రాగానే, పర్వతాకారుడు 'హుం'



అని హుంకరిస్తూ, "నువ్వు జాలరి పింగళుడివా? అయితే, మెడ చాచు, ఒక్క వేటుకు నీ కుత్తుక తెగేలా, యీ కత్తితో నరుకుతాను!" అన్నాడు.

కనురెప్పపాటులో, పింగళుడు ఒక నిర్ణయానికి వచ్చాడు. ఇంతదూరం వచ్చి వెనుదిరగటం ఎలానూ ప్రాణాపాయం అని అతడికి అర్థమైంది. అలా అని, మెడచాచినా, ఆ మహాకాయుడి కత్తికి అది తెగి కింద దొర్ల వచ్చును. ఏమైనాకానీ, అనుకుంటూ, పింగళుడు ఒక అడుగు ముందుకు వేసి మెడ వంచాడు. తక్షణం పర్వతాకారుడి చేతినుంచి కత్తిజారి కిందపడి, ఖంగుమని శబ్దం చేసింది. అతడు, పింగళుడి ముందు శవంలాగా ఢమీమంటూ బోర్లా పడిపోయాడు.

ఇలా జరిగేసరికి, పింగళుడికి ఎక్కడలేని సత్తువా, ధైర్యం కలిగినట్టయింది. అతడు సూటిగాచూస్తూ మొదటి ద్వారం దాటి, రెండవ ద్వారాన్ని సమీపించాడు. ఆ ద్వారం తలుపులుకూడా బంధించివున్నవి. చేతిలో పెద్ద శూలం ధరించిన ఒక గుర్రపురౌతు, పింగళుణ్ణి చూస్తూనే, మాటామంతీ లేకుండా, శూలాన్ని గురిగా పింగళుడి గుండెలపైకి ఎత్తాడు. పింగళుడు నిర్భయంగా గుండెలమీద వున్న చొక్కాను





పక్కకు తొలిగించి, "నే నెవరో తెలుసా? జాలరి పింగళుణ్ణి!" అంటూ ముందుకు నడిచాడు. మరుక్షణం గుర్రంతోపాటు, రౌతుకూడా కుప్పలా భూమిలోకి కుంగి పోయాడు. పింగళుడు, యినుమడించిన వుత్సాహంతో రెండవ ద్వారం దాటి మూడవ ద్వారాన్ని సమీపించాడు.

ఈ మూడవ ద్వారంముందు ఒక విలు కాడు, బాణం ఎక్కుపెట్టి, పింగళుడికేసి చూస్తూ నిలబడివున్నాడు. పింగళుడు తొణకకుండా ముందుకు నడుస్తూ, విలు కాడికి తన ఫాలభాగం వేలితో కొట్టి చూపించాడు. ఉత్తరక్షణంలో విలుకాడు పెద్దగా అరిచి పక్కకు పడిపోయాడు. పింగళుడు మూడవ ద్వారం దాటాడు.

నాలుగవ ద్వారాన్ని, పింగళుడు సమీపించ నున్నంతలో భీకరమైన అంకెలు వినిపించినై. ద్వారానికి అటూ యిటూ నిల బడివున్న రెండు ఖడ్గమృగాలు తలలువంచి, పింగళుడిమీదికి దూకేందుకు బుసలుకొడు తున్నాయి. పింగళుడు చలించకుండా ముందుకు నడిచి, ఆ ఖడ్గమృగాలను రెండు చేతులతోనూ అంటుకున్నాడు. వెంటనే అవి రెండూ భగ్గుమని ఒక్కసారి మండి బూడిదకుప్పలా అయిపోయినై.



పింగళుడు అయిదవ ద్వారాన్ని సమీ పించేసరికి, అక్కడ అతడికి కనబడిన వింత మృగం, అతడిలో భయానికన్న, ఆశ్చర్యం ఎక్కువ కలిగించింది. దాని శరీరం, వెనక కాళ్లూ సింహాకృతిలో వున్నవి. తలా, ముందుకాళ్లు మాత్రం గద్దను పోలివున్నవి. "ఇది ఏమి మృగం?" అని పింగళుడు అనుకునేంతలో, ఆ గరుడసింహం వెనక కాళ్లమీద లేచి, రెక్కలు అల్లల్లాడిస్తూ, పింగళుడిమీదికి వురకబోయింది.

పింగళుడు, ఓ తృటికాలం నిశ్చేష్టుడై, అంతలోనే తెలివి తెచ్చుకుని, "దారి తొలుగు! నేను జాలరి పింగళుణ్ణి!" అంటూ



ముందుకు అడుగువేశాడు. గరుడసింహం రెపీమని పేలి, తునాతునియలై పోయింది. పింగళుడు, దానికేసి ఓమారు జాలిగా చూసి, అయిదవ ద్వారాన్ని దాటి, ఆరవ ద్వారాన్ని సమీపించాడు.

ఈ ఆరవ ద్వారం దాటగలిగితే, తను మహామాయుడి సమాధిలో ప్రవేశించగల నన్న సంగతి గుర్తుకు రాగానే, పింగళుడికి పరమానందమయింది. వుంగరం, వజ్రాలు తాపిన పిడిగల కత్తి, భూగోళం—యీ మూడూ తనవి కానున్నవి!

పింగళుడు, అంతు లేని వుత్సాహంతో ఆరవ ద్వారాన్ని సమీపించాడు. అతడికి హఠాత్తుగా కన్ను చెదిరినట్టయింది. ఎదురుగా, ద్వారం పక్కన పద్మపాదుడు గద చేబూని నిలబడివున్నాడు. పింగళుడు మైకం కమ్మినవాడిలా ముందుకు అడుగు వేయబోయేసరికి, "ఆగు, ఆగు! నువ్వెవరివి?" అన్న భీకరమైన కంఠస్వరం వినబడింది. 'నన్ను మోసపుచ్చేందుకు, ఏదో పిశాచి పద్మపాదుడి ఆకృతి దాల్చింది!' అని పింగళుడు అనుకునేంతలో, ధగధగ మెరుస్తున్న గద, అతడి నేత్రాలముందు కదిలింది. పింగళుడు, భయకంపితుడై వెనక్కు అడుగు వేశాడు.

"ఎవడో దొంగ, జాలరి పింగళుడు కాడు! బయటికి గెంటండి! దూరంగా విసిరివేయండి!" అన్న కేకలు పింగళుడికి వినిపించినై. ఆ వెంటనే, అతడి వీపుమీదా, తలమీదా కర్రతో, చేతులతో ఎవరో మోద సాగారు. ఒక్కొక్క ద్వారమే టకటకమని మూసుకోసాగింది. పింగళుడు, భయంతో వణికిపోతూ, కళ్లు తెరిచేంతలో, అతడు గాలిలో ఎగిరిపోతున్నాడు. అతడి దృష్టి కిందకు మళ్లింది. అక్కడ పద్మపాదుడు చేతులు చాచి, తను కింద పడకుండా పట్టుకునేందుకు సిద్ధంగా వున్నాడు.

—(ఇంకా వుంది.)



# విఫలమైన ఆశలు



విసుగుచెందని విక్రమార్కుడు చెట్టుపద్దకు తిరిగివెళ్లి, శవాన్ని దించి భుజానవేసుకుని, మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, పట్టుదల ఉన్నంతమాత్రాన ప్రయోజనం లేదు; ఫలితం సిద్ధించాలి. లేకపోయి నట్టయితే, పట్టుదల ప్రమాదకరంగా పరిణ మించగలదు. వెనక నందుడనేవాడికి అదే జరిగింది. అతని కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పూర్వం పడమటితీరాన ఒక బెస్త గ్రామం ఉండేది. ఆ గ్రామంలో ఇరవై కుటుంబాలుండేవి. గ్రామం మధ్యలో ఒక దేవి ఆలయం ఉండేది. ఆ దేవికి మొక్కు కుంటే చేపలవేట జయప్రదంగా సాగేది. తుఫానులు వచ్చినప్పుడు ఆ దేవికి ముడు పులు కట్టేవారు; తుఫానువల్ల బెస్తలకు ఎట్టి నష్టమూలేకుండా దేవి కాపాడేది.

## బేతాళ కథలు

బెస్తలందరిలోకీ అనుభవమూ, సమర్థతా ఉన్నవాణ్ణిగా చూసి నాయకుడుగా ఎన్నుకోవటం ఆచారంగా ఉండేది. సాధారణంగా ఈ గ్రామంలో పుట్టినవారు ఇక్కడే ఉండి జీవితాంతంవరకూ చేపలవేటతోనే జీవిస్తూ ఉండేవారు. కాని ఎప్పుడైనా యువకులలో కొందరు నావికావృత్తిలో ప్రవేశించి వర్తకనౌకలలో కళాసులుగా చేరి ద్వీపాంతరాలకు వెళ్లేవారు. ఇలా నావికులుగా వెళ్లినవారిలో కొందరు దురదృష్ట వశాత్తూ నౌకలతోబాటు మునిగిపోయేవారు. మిగిలినవారు బాగా డబ్బు సంపాదించుకుని గొప్పగొప్ప నగరాలలో నివాసం ఏర్పరుచుకునేవారు. అందుచేత గ్రామంలోని యువకులు నావికులుగా వెళ్లిపోవటం పెద్దలకు అంత ఇష్టంగా ఉండేదికాదు.

నందుడనేవాడు బెస్తదొర రెండవ కొడుకు. వాడి అన్న సుందుడు వాడికన్న బాగా పెద్దవాడు. నందుడు ఏడేళ్లవాడై ఉండగా తండ్రి చనిపోయాడు. రేణుకుడనేవాడు బెస్తలకు దొరగా ఎన్నిక అయినాడు. సుందుడు తన తండ్రివద్దనే చేపల వేట నేర్చుకుని, ఇంకొకరి సహాయం లేకుండా తానే తెప్పనడుపుకు పోవటమూ, వలవెయ్యటమూ, వల మరమ్మతు చెయ్యటమూ మొదలైన పనులు చెయ్యగలిగి



ఉన్నాడు. నందుడికి మాత్రం, యిలాంటి పనులలో బొత్తిగా అనుభవంలేదు. అందు చేత వాణ్ణి వాడి తల్లి రేణుకుడిదగ్గిర చేపల వేట నేర్చుకోవటానికి పెట్టింది.

మొదటినుంచికూడా నందుడు చాలా చురుకుగలవాడే కాక, సాహసికూడానూ. అందుచేత వాణ్ణి రేణుకుడు ఎంతో మెచ్చు కునే వాడు. ఊళ్లో అంతా వాణ్ణి గురించి ఆశ్చర్యంగా చెప్పుకునే వారు. "ఇటువంటి వాడు నావికుడయితే ఎంతైనా సంపాదించ గలుగుతాడు!" అని బెస్తలు అప్పుడప్పుడూ అనేవారు. వెంటనే నందుడి తల్లి, "అమ్మో, నా కొడుకు నావికుడు కావటమే? నేను ఒప్పను!" అనేది. ఆమెకు తనకొడుకు నావికుడైతే యిల్లువదిలి పోతాడని భయం.

రేణుకుడికి సుందరి అని ఒక కూతు రుండేది. అది నందుడికన్న రెండేళ్లు చిన్నది. పేరుకు తగినట్టు అది అందమైన పిల్లకావటంచేత అందరూ దాన్ని ముద్దు చేసేవారు. ఒకరోజు రేణుకుడు సుందరిని వేళాకోళానికి, "పెద్దయితే నువు ఎవరిని పెళ్లిచేసుకుంటావే?" అని అడిగితే, "అదుగో, ఆ నందుణ్ణే చేసుకుంటా! ఇంకె వ్వర్నీచేసుకోను!" అన్నది.

ఈ మాట వినగానే నందుడి మనస్సులో ఏదో తుఫానురేగినట్టయింది. వాడికి సుంద






రిని చూస్తే ఎంతో ఇష్టం. కాని ఆ పిల్ల తనను తప్ప ఇంకెవరినీ చేసుకోను అనగానే వాడికి తన భవిష్యత్తు యావత్తూ ఒక్కసారి కళ్ల ఎదట కనపడినట్టయింది. ఇంకో ఏడెనిమిదేళ్లలో సుందరికి పెళ్లి యీడు వస్తుంది. అప్పుడు తనకూ దానికీ పెళ్లవుతుంది. అందుచేత ఈలోపుగానే తాను బోలెడంత ధనం సంపాదించాలి. ఈ వూళ్లో ఉండి చేపలుపడితే ధనం రాదు. అందుచేత తాను ఈ వూరు వదిలి వెళ్లిపోయి నావికుడుగా చేరాలి. కాని ఇదంతా తనవల్ల అవుతుందా? దేవి అనుగ్రహిస్తే ఎందుకు కాదు?

వాడు ఒంటరిగా దేవిగుడికివెళ్లి మొకరించి, "అమ్మా, తల్లీ! నన్ను నావికుణ్ణి చేసి బాగా డబ్బువచ్చేటట్టుచేస్తివా, సముద్ర తీరాన, సముద్రంమీద రెండు కోసుల దూరం కనిపించేటట్టు, గుట్టమీద నీకు పెద్దగుడి కడతాను! తరవాత సుందరీ, నేనూ పెళ్లాడి, మేమిద్దరమూ రోజూ నీకు మొక్కుకుంటాము!" అని ప్రార్థించాడు.

ఆ తరవాత వాడు తల్లివద్దకు వెళ్లి ఆమెతో, "అమ్మా, నేను యీ పల్లెవదిలి వెళ్లిపోయి నావికుణ్ణి అవుతాను. నన్ను ఆశీర్వదించు!" అన్నాడు.

తల్లి ఈ మాట విని నిర్ఘాంతపోయింది. వెళ్లవద్దని కొడుకును బతిమాలుకున్నది. "నాయనా, నాకు మీరిద్దరూ చెరొక కన్ను వంటివాళ్లు. నువు వెళ్లితే నేను సగం గుడ్డి దాన్నవుతాను. ఇంత చిన్నవయసులో నువు నావికుడివి కావటమేమిటి? నువ్వేమై పొయ్యావో అని నేను రోజూ దిగులు పడుతూ బతకలేను. నువు ఒకవేళ డబ్బు సంపాదించి సుఖంగా ఉన్నా, తిరిగిరావు! నాకు తెలుసు!" అని తల్లి అన్నది.

నందుడు తిరిగివస్తానని తల్లిమీద ఒట్టు పెట్టుకున్నాడు. తాను దేవతకు మొక్కిన మొక్కు విషయంకూడా వాడామెకు చెప్పే

శాడు. నావికుడు కావాలన్న ఉద్దేశం వాడు మార్చుకునేటట్టు కనబడలేదు. విధిలేక తల్లి సరేనన్నది. వాడు వెంటనే బయలు దేరి వెళ్లిపోయాడు.

దేవి వాడికోరిక ఈడేర్చిందనే చెప్పాలి. ఎందుకంటే, పసివాడైనప్పటికీ వాడికి వర్తక నౌకలలో ఉద్యోగం దొరికింది. వాడికి సహజంగా ఉన్న చురుకుదనం నౌకలు నడపటంలో బాగా రాణించింది. ఎన్నోసార్లు వాడు వర్తకులకు అపదలో అడ్డుపడ్డాడు. ఆరితేరిన నావికులుకూడా బెదిరే తుఫానులలో వాడు యుక్తిగా ఓడలను నడిపి చాలా సమర్థుడనిపించుకున్నాడు. అనేకమంది వర్తకులు వాడికి బహుమానాలిచ్చారు. తమ లాభాలలో వంతులిచ్చారు. వాడు చాలా ధనం సంపాదించుకున్నాడు.

ఎనిమిదేళ్లపాటు నావికుడుగా జీవించి నందుడు తాను సంపాదించిన ధనంతో స్వగ్రామానికి చేరుకున్నాడు. అప్పటికి రెండు సంవత్సరాల క్రితమే సుందరి సుందుడికి భార్య అయిపోయింది. నందుడి ఆశలన్నీ అడుగంటిపోయాయి. ఆ సుందరి కోసమే వాడు అన్ని శ్రమలుపడి అంత డబ్బు సంపాదించుకుని వచ్చాడు. ఇప్పుడు



వాడికి భవిష్యత్తు శూన్యంగా కనిపించింది. సుందరిని కాక మరొకరిని చేసుకోవటం వాడికి ఎంతమాత్రమూ ఇష్టంలేదు; ఎందుకంటే, ఎనిమిదేళ్లుగా వాడు సుందరే తన భార్య అని మనస్ఫూర్తిగా నమ్మాడు.

అయితే సుందరి నందుణ్ణి ఏనాడో మరిచిపోయింది. ఆ రోజు నందుణ్ణి తప్ప ఇంకొకరిని పెళ్లాడనని అన్నమాటకూడా ఆమెకు జ్ఞాపకంలేదు. నందుడు నావికుడు కావటానికి వెళ్లిపోయిన నాలుగేళ్లకు సుందరి తండ్రి చనిపోయాడు. సుందరినీ ఆమె తల్లినీ పోషించే మగదిక్కెవరూ లేరు. అందుచేత వాళ్లు తిండికికూడా చాలా

ఇబ్బంది పడ్డారు. ఈ లోపల సుందుడు చేపలవేటలో చాలా ప్రవీణుడైనాడు. ఆ గ్రామంలో సుందరిని పెళ్లాడటానికి అతని కంటె అర్హుడెవడూలేడు. అతను తననూ, తన తల్లినీ ఆదుకుని సహాయపడినందుకు సుందరి అతన్ని ఇష్టంగానే పెళ్లాడింది.

ఈ సంగతులన్నీ తెలుసుకున్నాక నందుడు ఎవరినీ తప్పుపట్టలేక పోయాడు. కాని అతని మనసులో సుందరిమీద ఆశ మాత్రం చావలేదు. సుందరిని ఎలాగైనా తనతో వచ్చెయ్యటానికి ఒప్పించి, ఆమెను ఏ దూరదేశమన్నా తీసుకుపోయి అక్కడ పెళ్లాడి సుఖంగా ఉందామని అతనికి దుర్బుద్ధి పుట్టింది. ఈ ఆలోచనను అతను రహస్యంగా సుందరికి చెప్పాడు. సుందరి ఈ సంగతంతా తన అత్తగారితో చెప్పేసింది.

నందుడి తల్లికి తనకొడుకు స్థితి చూసి చాలా బాధ కలిగింది. ఆమె అతనిని ఒంటరిగా అవతలికి తీసుకుపోయి, "కులానికి కళంకం తెచ్చే ఈ బుద్ధులు నువు ఎక్కడ నేర్చుకున్నావు, నాయనా? నావికుడుగా దేశదేశాలూ తిరిగి ఇంతపాడై పోయావా? నీకు వదినె ఒకటీ, తల్లినైన నేను ఒకటీనా? నీ సుఖంకోసం నీ అన్న కాపరం పాడుచేస్తావా? ఇలా తిరిగి వచ్చే కన్న నువు తిరిగి రాకుండా ఉంటేనే ఎంతో



బాగుండిపోయేదే ? ప్రయోజకుడివై ఇంత డబ్బు సంపాదించుకున్నావు. ఎక్కడనైనా బతకగలవు. ఈ వూళ్లో ఉండి నువు బాధ పడుతుంటే నేను చూడలేను. ఇంకెక్కడి కైనా వెళ్లిపో !" అన్నది.

"సరే నమ్మా ! వెళ్లిపోతాను !" అన్నాడు నందుడు తలవంచుకుని.

మర్నాడు తెల్లవారు జామున సుందుడు ఒక తెప్పమీద చేపలవేటకు బయలుదేరే టప్పుడు నందుడు, "అన్నా, నేను చేపల వేటకుపోయి చాలా కాలమయింది. ఇవాళ నేనుకూడా ఒక తెప్ప వేసుకుని వేటకు వస్తాను !" అన్నాడు.

ఇద్దరన్నదమ్ములూ చెరొక తెప్పా వేసుకుని సముద్రంమీద బయలుదేరారు.

సూర్యాస్తమయానికి కొంచెం ముందుగా బెస్తలు తిరిగి వచ్చే వేళకు సుందరీ, ఆమె అత్తగారూ భోజనంతోసహా సముద్రతీరానికి వచ్చారు. కొద్ది సేపట్లో అందరూ తిరిగి వచ్చారు, కాని నందుడు మాత్రం తిరిగి రాలేదు. అతనికోసం సుందుడూ, మరి కొందరూ తిరిగి సముద్రంమీద వెదుక్కుంటూ వెళ్లారు. వారికి నందుడు తీసుకుపోయిన తెప్ప మాత్రమే దొరికింది. నందుడి జాడలేదు. అతను సముద్రంలోపడి ఆత్మహత్య చేసుకున్నాడు.



బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకొక సందేహం కలుగుతున్నది. నందుడి ఆశలు విఫలం కావటానికి కారకులెవరు? తనను నమ్మి వరం అడిగితే నందుడి కోరిక సిద్ధింప జేయని దేవతా? నందుడిలో లేనిపోని ఆశ రేకెత్తించి, అతనికోసం వేచి ఉండక అతని అన్నను పెళ్లాడిన సుందరా? అతని ఆశలకు అటంకంగా నిలబడిన నందుడి తల్లా? సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగలిపోతుంది!" అన్నాడు.

"ఇందులో దేవత తప్పేమీలేదు. సుందరిని పెళ్లాడటమే నందుడికి కావలిసినట్టయితే ఆమెను తన భార్యగా చెయ్యమని అతను దేవతను ప్రార్థించి ఉండవలిసింది. నందుడా పని చెయ్యలేదు. తాను నావికుడై డబ్బు గడించి తిరిగి వచ్చేటట్టు దేవి వరమిస్తే సుందరిని పెళ్లాడటం తన చేతిలోనే ఉన్నదని అహంకరించాడు! సుందరి తప్పుకూడా ఏమీలేదు. ఆమె నందుణ్ణే చేసుకుంటానని అన్నప్పుడామె లోకజ్ఞానం ఎరగని పసిపిల్ల. దాని కామె ఎంత మాత్రమూ బాధ్యురాలు కాదు. అతని తల్లిదికూడా తప్పుకాదు. ఆమె మొదటి నుంచీ నందుడికి హితమే చెప్పింది. నావికుడు కావద్దని ఆమె చెప్పినమాట విన్నట్టయితే సుందరిని అతను పెళ్లాడే ఉండేవాడు. తల్లిమాట వినక వెళ్లిపోయాడు. వెళ్లినవాడు బతికి ఉన్నాడో లేదో, ఉంటే తిరిగివస్తాడో లేదో, వస్తే సుందరిని పెళ్లాడతాడో లేదో తల్లికి తెలియదు. ఆమెకు తన కొడుకులిద్దరి సుఖమూ కావాలి. చిన్నకొడుకు సుఖంకోసం పెద్దకొడుకు సుఖమూ, దానితో బాటు కులగౌరవమూ పోగొట్టుకోవటం ఆవిడ కిష్టంలేదు. నందుడి దురాశే అతని చావుకు కారణం!" అన్నాడు విక్రమార్కుడు.

ఈ విధంగా రాజుకు మౌనభంగం కాగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)



# మోసపుచ్చిన రామచిలుక

మగధరాజ్యంలో ఒక గొప్ప వర్తకుడు వుండేవాడు. అతడు ఓడలమీద వర్తకానికి వెళ్ళేవాడు. అలా వెళ్ళేముందు ఇంట్లో అందర్నీ, "నేను దేశంపోతున్నాను. మీకు ఏమేమి కావాలి?" అని అడిగేవాడు.

ఇలాగే ఒకమారు అడిగి, అందరి కోరికలూ తెలుసుకున్నాడు. తరువాత తాను పెంచుతున్న రామచిలుకవద్దకు వెళ్లి దానినికూడా అడిగాడు. అప్పుడా చిలుక "ఆరోజు నీవు నన్ను పట్టిన అడవిలో ఒక పెద్ద రావిచెట్టు ఉంది. ఆ చెట్టుమీద ఇంకా ఎన్నో చిలుకలుంటాయి. నీవు వెళ్ళి వాటితో, 'మీలాటి చిలుకే నావద్దకూడా ఒకటుంది. అది మీతో ఈ మాట చెప్పమన్నది,' అను. అవి ఏమి జవాబిస్తాయో వచ్చి నాతో చెప్పు. ఇదే నాకు కావలసిన ఉపకారం," అని చెప్పింది.

మరునాడే వర్తకుడు ప్రయాణం కట్టాడు. ఆరు నెలలకు తన వ్యాపారము పూర్తి అయింది. తరువాత చిలుక చెప్పిన అడవిలో పెద్ద రావిచెట్టువద్దకు వెళ్ళి అక్కడ ఉన్న వేలకొలది చిలుకలతో తన చిలుక చెప్పిన ప్రకారము చెప్పాడు. ఇది వినగానే వాటిలో ఒక చిలుక రెపరెపా రెక్కలు కొట్టుకొని కిందపడి పోయింది. తక్కినవన్నీ ఏ జవాబు చెప్పకనే ఎగిరి పోయాయి. ఈ సంఘటన చూచి విచారించి, అచ్చటనుండి వర్తకుడు ఇల్లు చేరుకున్నాడు. అతడు అడవిలో జరిగిన వార్తను తన చిలుకకు చెప్పాడు.

వెంటనే ఆ చిలుకకూడా గిలగిలా తన్నుకొని పంజరంలో పడిపోయింది. 'అయ్యో!' అనుకొని వర్తకుడు పంజరం తలుపు తెరిచాడు. వెంటనే చిలుక రివ్వున ఆకాశమార్గాన ఎగిరింది. వర్తకుడు మోసంగ్రహించి చేసేదిలేక చూస్తూవూరుకున్నాడు.

—విశ్వం






# మంగలి మంత్రిత్వం

పూర్వం బాగ్దాదు నగరంలో ఒక కోటీశ్వరు డుండేవాడు. ఆయనకు ఒక్కడే కుమారుడు కమర్. తండ్రి చనిపోగానే కమర్ ఆస్తికి హక్కుదారై, అంతులేని దాసదాసీ జనాలతో అతి వైభవంగా జీవితం గడప సాగాడు. దుస్తుల విషయంలోనూ, ఆహార పానీయాల విషయంలోనూ అతను ఏలోటూ జరగనిచ్చేవాడు కాడు. అయితే అతనికి ఆడవాళ్లంటే మాత్రం ఎంతో ఏవగింపు. ఆకారణంచేత అతను పెళ్లి చేసుకునే ఆలోచనకూడా తలపెట్ట లేదు.

ఒకనాడు కమర్ ఒక ఇరుకు వీధికుండా పోతూ ఉండగా అతనికి ఎదురుగా ఒక ఆడవాళ్ల పటాలం వచ్చింది. ఆడవాళ్ల పొడగిట్టనివాడు కాపటంచేత, ఆ స్త్రీలు సమీపానికి వచ్చేలోపుగానే అతను తప్పుకుని పక్క తోటలోకి ప్రవేశించి, అక్కడ ఒక బల్లమీద చతికిల బడ్డాడు. సరిగా అదే సమయానికి అతనికి ఎదురుగా ఉన్న ఇంటివాకిలి తెరుచుకుని ఒకయువతి బయటికి వచ్చి పూలమొక్కలకు నీరు పోయ సాగింది.

ఎన్నడూ ఆడదంటే గిట్టని కమర్‌కు ఆ కన్యను చూడగానే ఎక్కడలేని ప్రేమా పుట్టుకొచ్చింది. ఆమె ముఖం అతని కళ్లకు చందమామలాగా కనిపించింది. ఆమె ఎవరి కూతురో, ఆమెను తాను వివాహ మాడే అవకాశం ఉన్నదో లేదో తెలుసుకుందామని అతను అనుకునేటంతలో బాగ్దాదు నగరపు కాజీ సపరివారంగా వచ్చి ఆ ఇంట్లోనే ప్రవేశించాడు. తాను చూసిన పిల్ల కాజీ గారి కుమార్తె అనీ, ఆమెను పెళ్లాడే అవకాశం తనకు లేదనీ నిశ్చయించుకుని, విచారంతో కమర్ ఇంటికి వెళ్లిపోయాడు.

అతని వాలకం చూడగానే అతని నౌకర్లకందరికీ చాలా ఆందోళన కలిగింది. "ఎందు

కె. సూర్యప్రకాశరావు

కలా ఉన్నారు? వొంట్లో సరిగాలేదా? వైద్యుణ్ణి పిలిపించమా?" అని వాళ్ళు తమ యజమానిని అడిగారు. కమర్ వాళ్లకు నిజం చెప్పలేదు. అయితే అతని ఇంట్లో ఉండే ముసలి దాది ఒకతె నిజం ఊహించింది. ఆమె ఒంటరిగా కమర్ వద్దకు వచ్చి, "ఇంత కాలానికి నీ మనసులో ఎవతె మీదనో ప్రేమపుట్టుకొచ్చింది. అది ఎవరో చెప్పు! ఆమెను తెచ్చి నీకుభార్యగా చెయ్యటానికి ప్రయత్నిస్తాను," అన్నది.

ఆమె ఆ మాట అంటేనే కమర్‌కు సగం విచారం తగ్గినట్టయింది. అతను పూసగుచ్చి నట్టు జరిగినదంతా ముసలిదానికి చెప్పేశాడు.

"కాజీగారి అమ్మాయేనా? నేను బాగా ఎరుగుదును. ఆ పిల్ల నిన్ను పెళ్లాడటానికి ఒప్పుకునేటట్టు నేను చేస్తాను. నువేమీ విచారపడకు," అని ముసలిది తన యజమానికి అభయం ఇచ్చింది.

కాని ముసలిదాని మొదటి ప్రయత్నం ఫలించ లేదు. ఆమె కాజీ కుమార్తెను కలుసుకుని కమర్ విషయం చెప్పనారంభించగానే, ఆ పిల్ల కస్సుమని లేచి, "నీ యజమాని ఎవడో నే నెరగను! నాతో ఇలాంటి ప్రసంగాలు చేశావంటే మానాన్న




గారితో చెప్పితే నీకు కైదు వేయిస్తారు!" అని బెదిరించింది.

అయినా ముసలిది అసాధ్యురాలు గనక అంతటితో పోనివ్వక, రెండు రోజులాగి, కాజీ ఇంటలేని సమయంలో ఆ పిల్ల దగ్గిరకి మళ్లీ వెళ్లి బోరున ఏడవసాగింది.

"ఏం జరిగింది? ఎందుకేడుస్తున్నావు?" అని కాజీ కూతురు ఆమెను అడిగింది.

"ఇంకేముంది? నా యజమాని బతకడు! నా కొడుకల్లే పెంచుకున్నాను! నిన్ను ఎటువంటి వేళ చూశాడోగాని మంచంపట్టి, ఆరోజు కారోజు క్షీణించి పోతున్నాడు!" అన్నది ముసలిది.

కాజీ కుమార్తె హృదయం కాస్త మెత్తబడింది. "మీ యజమాని పట్టి పిచ్చివాడులాగున్నాడే! ఒక మనిషి కోసం మంచం పట్టి చచ్చిపోవాలా? రేపు శుక్రవారం నాటి మధ్యాన్నం మసీదులో ప్రార్థనలు జరిగే వేళ ఒకసారి మా యింటికి రమ్మను. నేనతనితో మాట్లాడి అతను ఎటువంటి వాడైనదీ తెలుసుకుంటాను. మా నాన్నగారికి ఈ సంగతి ఏ మాత్రం తెలిసినా చాలా ప్రమాదం సుమా!" అని ఆ పిల్ల ముసలిదానితో అన్నది.

"నా తల్లి! మా యజమానికి ప్రాణదానం చేశావు! ఒక్కసారి ఆయినతో మాట్లాడితే అతని ప్రేమ ఎటువంటిదో నీకే తెలుస్తుంది," అంటూ ముసలిది శలవు పుచ్చుకుని యింటికి వెళ్లింది.

ఆమె వచ్చి ఈ వార్త చెప్పినప్పుడు కమర్ పరమానందభరితుడైనాడు. శుక్రవారం రాగానే అతను తన ప్రియురాలి కోసం వెళ్లటానికి సన్నాహం అవుతున్నాడు.

"బాబూ, మధ్యాన్నపు ప్రార్థనలకింకా వ్యవధి చాలా ఉంది. గడ్డం మాసినట్టుంది, మంగలిని పిలుస్తాను," అన్నది ముసలిది. కమర్ సరే నన్నాడు.

కొద్ది సేపట్లోనే మంగలి ఒకడువచ్చాడు. వాడు కమర్‌ను చూస్తూనే, "అలా పాలి



పోయి ఉన్నారేం, బాబూ?" అని అడిగాడు.

"ఈ మధ్య కాస్త సుస్తీ చేసిందిలే. ఇప్పుడు బాగానే ఉంది," అన్నాడు కమర్.

"శుక్రవారంనాడు క్షవరమైతే డెబ్బై ఆపదలు తొలిగిపోతాయని పెద్దలంటారు. కళ్లకూ, ఒంటికీ కూడా చాలా మంచిది," అన్నాడు మంగలి.

ఈ మంగలివాడి వాగుడు వింటుంటే కమర్‌కు చిరాకెత్తింది. "ఈ సోది అంతా దేనికి? వెంటనే గడ్డం గొరిగెయ్యి!" అన్నాడతను వేగిరపడుతూ.

అప్పటికీ మంగలి తన పని ప్రారంభించక, "ఇంకా కొద్దిగా వర్జం ఉంది, బాబూ. అది గడిస్తే ఇవాళ క్షవరానికి ప్రశస్తమైన రోజు. ఎందుకంటారేమో, ఇవాళ కుజబుధులు ఒకే ఇంట్లో చేరుతున్నారు. కాని ఒక్క చిక్కున్నది. మీరు ఎవరినో చూడబోతున్నారు లాగుంది. కొత్తవారిని కలుసుకోవటానికిది మంచిరోజు కాదు. అందువల్ల ఆపద కలుగవచ్చు," అన్నాడు.

కమర్ మండిపడి, "నీ వాగుడు కట్టిపెడతావా, లేదా? నేను నిన్ను క్షవరానికి పిలిచాను గాని, జోస్యం చెప్పటానికి కాదు. వచ్చిన పనేదో చెయ్యి," అన్నాడు.

"బాబూ, గ్రహాలను అంత తేలికగా కొట్టెయ్యకండి! విషయోగం! చాలా





వద్దు, నీ క్షవరమూ వద్దు ; ఈ డబ్బు తీసుకుని వెళ్లిపో!" అన్నాడు.

"ఊరికే ఇస్తే డబ్బు పుచ్చుకుంటానా, బాబూ? నాకు కావాలిసింది తమకు సేవ చెయ్యటమే! డబ్బు ఇవ్వకపోయినా ఇబ్బంది లేదు. మీ నాన్నగారికి నేను ఎంతో సేవ చేశాను! నా సలహా లేకుండా ఆయన ఏ పనీ చేసేవారు కారు. వారి కొడుకేగా తమరూ?" అన్నాడు మంగలి.

కమర్ ప్రాణం విసిగి, నౌకర్లను పిలిచి మంగలిని బయటికి గెంటింతామనుకుంటుండగా, మంగలి గడ్డానికి నీళ్లు రాచి క్షవరం ఆరంభించాడు. అప్పటికీ వాడు వాగటం మానలేదు. తన చేతులతో ఏ యే మహారాజులకు క్షవరం చేశాడో; మంత్రులూ, మహాకవులూ తనను ఎంతగా ప్రశంసించారో చెప్పసాగాడు. చివరకు వాడు, "తమరు చాలా తొందరలో ఉన్నట్టు కనబడుతున్నారు. ఏమిటి విషయం?" అని అడిగాడు.

"ఒక మిత్రుడి ఇంటికి విందుకు పోతున్నాను," అన్నాడు కమర్.

"ఎందుకైనా మంచిది, ఒంటరిగా వెళ్లక నన్నుకూడా వెంట రానివ్వండి!" అన్నాడు మంగలి.

ప్రమాదం! ఏమిటనుకున్నారు?" అన్నాడు మంగలి వినయంగా.

"నా కెక్కడ దొరికావురా? ఈ బాగ్దాదులో జోస్యం చెప్పే మంగలి ఇంకొకడున్నా డనుకోను. నా పాలిటికి నువే దాపరించాలా?" అన్నాడు కమర్.

"ఒక్క జోస్యమేనా, బాబూ? నాకు రసాయనం, గణితం, వాస్తు, తర్కం, వ్యాకరణం, కొరాన్ భాష్యం, అన్నీ వచ్చు. పైన నా వయసూ, అనుభవమూ చిత్తగించడి," అన్నాడు మంగలి.

కమర్ ఇక సహించలేక పాయినాడు. మంగలికి డబ్బు తీసి ఇస్తూ, "నువ్వూ

"నేను వెళ్ళే చోటికి ఇంకొకరు రావటానికి వీల్లేదు!" అన్నాడు కమర్.

"అహా! నాకంతా అర్థమయింది. ఎవరో స్నేహితురాలన్న మాట! చూడండి, బాబూ! నేను వెంట ఉండటం మీ కెంతో మేలు. ఆడవాళ్లతో వ్యవహారం చాలా ప్రమాదం! నేను బాగా అనుభవం గలవాణ్ణి. మీకు ఎలాటి ప్రమాదమూ రాకుండా కాపాడ తాను!" అన్నాడు మంగలి.

"ఛీ, నోరు మూసుకుని నీ పని పూర్తి చెయ్యి!" అన్నాడు కమర్.



మంగలి క్షవరం పూర్తి చేసే సమయాని కప్పుడే ప్రార్థనలు ఆరంభంకానే అయాయి. కమర్ మంగలివాణ్ణి పంపేసి, గబగబా దుస్తులు వేసుకుని కాజీగారి ఇంటికి పరిగెత్తాడు. ఎందుకంటే అప్పటికే చాలా ఆలస్యమై పోయింది. కాజీ ఇంటి వాకిలి తెరిచే ఉంది. కమర్ లోపలికి వెళ్లి, పై అంతస్తుకు చేరాడో లేదో, కాజీ మసీదు నుంచి తిరిగి రానే వచ్చాడు.

ఈ లోపల మంగలి కమర్‌ను వదలలేదు. వాడు వెళ్లిపోయినట్టే పోయి, ఏ మూలనో నక్కి ఉండి, కమర్‌ను వెంబడించి కాజీ ఇంటిదాకా వచ్చి, ఇంటి ఎదురుగా బల్లమీద కూచున్నాడు. కమర్ లోపలికి వెళ్లిన కొద్ది క్షణాలకు కాజీ రావటం గమనించి, "అబ్బాయిగారికి మూడింది!" అనుకున్నాడు మంగలి.

దురదృష్టవశాత్తూ కాజీ ఇంటికి రాగానే ఒక ఆడబానిసమీద అలిగి రెండు తగిలించాడు. అది గొంతెత్తి ఏడవసాగింది. ఇంకొక మగబానిస దాన్ని వెనక వేసుకు వచ్చి వాడుకూడా కాజీచేత చచ్చేటట్టు తన్నులు తిన్నాడు.

ఇదంతా బయటినుంచి వింటున్న మంగలికి, కాజీ తన యజమానిని చావగొట్టుతున్నట్టు అర్థమయింది. వాడు వెంటనే గొంతెత్తి. "అయ్యో! బాబో! రక్షించండి!

కాజీ నా యజమానిని చంపేస్తున్నాడు!" అని కేకలు పెట్టసాగాడు. నలుగురూ పోగై, "ఏమిటి? ఏమిటి?" అని అడిగారు.

బయట గల్లంతు విని కాజీ బయటికొచ్చి, "నా యింటిముందు ఈ జాతరేమిటి?" అని అడిగాడు.

మంగలి ముందుకొచ్చి, "మీ కూతురి కోసం వచ్చాడని మా యజమానిని మీరు చావగొట్టలేదా?" అని అడిగాడు.

"నా కూతురి కోసం నీ యజమాని రావటమేమిటి? నీ కేమైనా మతి పోయిందా?" అన్నాడు కాజీ.

"నాకు మతిపోవటమేమిటి? ఆ అబ్బాయి గారు మీ ఇంటో జొరబడటం నేను కళ్లారా చూస్తినే?" అన్నాడు మంగలి.

వెంటనే కాజీ తన ఇల్లంతా నౌకర్లచేత వెతికించాడు. పై అంతస్తుకు వెళ్లిన కమర్ కాజీ కుమార్తెను చూసే లోపలనే ఈ అల్లరి సాగింది. అతను ఒక గదిలో ఖాళీ కొయ్యపెట్టె ఉంటే అందులో దూరి దాక్కున్నాడు. మిగిలిన వాళ్లతో బాటు మంగలికూడా కాజీగారి ఇల్లంతా వెతికాడు. కమర్ దాగిఉన్న కొయ్యపెట్టె కళ్లబడగానే వాడు కమర్ అందులో దాగినట్టు గ్రహించి, ఎవరితోనూ చెప్పకుండా పెట్టె తన నెత్తిన పెట్టుకుని బయటికి ఉరికాడు. వాడు బయటి వాకిలి దాటేటప్పుడు గడపకు కాలు తగిలి పడ్డాడు. పెట్టె కిందపడి పగిలింది. పెట్టెలో ఉన్న కమర్‌కు కాలు విరిగింది.

అతను పెట్టెలోనుంచి పైకి రాగానే పదిమందీ అతన్ని పట్టుకోవటానికి చుట్టూ మూగారు. కమర్ తన జేబులో నుంచి బంగారు నాణాలు తీసి దూరంగా విద జల్లాడు. జనం అతన్ని వదిలేసి బంగారం కోసం పరిగెత్తారు.

చావు తప్పి, కన్ను లొట్టపోయి, కమర్ కుంటు కుంటూ, తన ఇల్లు చేరి, ఆ రాత్రే బాగ్దాదు నగరంవిడిచి, ఎటో వెళ్లిపోయాడు.



# నావికుడు సింద్‌బాద్

దాన్ని నిద్ర అనండి, మూర్ఛ అనండి, అది ఒక సంవత్సరంపాటు సాగిందనిపించింది. నాకు మళ్లీ స్పృహ తెలిసేటప్పటికి ఎండా వెలుగూ కనిపించాయి. నేనొక విశాలమైన పచ్చిక మైదానంలో పడుకుని ఉన్నాను. నా తెప్ప ఒక నది ఒడ్డున కట్టిపెట్టి ఉన్నది. నా చుట్టూ మందగా మూగి అనేకమంది ఇతియోపియనులున్నారు.

నేను మేలుకున్నానని తెలియగానే వాళ్లు మాట్లాడనారంభించారు. కాని నాకు వారి భాష రానందున ఏమీ బదులు చెప్పలేక పోయాను. ఇంతలో ఒక మనిషి ముందుకువచ్చి, స్వచ్ఛమైన అరబ్బీ భాషలో, " మీరెవరు ? ఎక్కడినుండి వచ్చారు ? మా దేశానికి ఏం పనిమీద వచ్చారు ? మేము రైతులం. మా పొలాలకు నీరుపెట్టుకునే టందుకు వచ్చి, తెప్పమీద నిద్రపోతూ మీరు నదిమీద వస్తూండటం చూశాం. మేము దాన్ని ఆపి, ఒడ్డున కట్టేసి, మిమ్మల్ని తెచ్చి ఇక్కడ పడుకోబెట్టాం. మీ అంతట మీరు లేచేదాకా మేము లేపదలచ లేదు. అసలు మీ రిక్కడికి ఎట్లా వచ్చారో తెలియజేయండి," అన్నాడు.

ఆరవ సముద్రయానం

CHITRA



'ముందు ఇంత అన్నం పెట్టండి. తరవాత మీరు కోరేదల్లా చెబుతాను,' అన్నాను.

వెంటనే వాళ్లు నాకు కడుపునిండా తిండి పెట్టారు. నాకు పోతున్న ప్రాణం తిరిగి వచ్చినట్టయింది. నేను వారికి నా కథ యావత్తూ చెప్పాను. నా కథ విని వాళ్లందరూ అశ్చర్యంగా మాట్లాడుకోసాగారు. నా మాటలు వారికి తర్జుమాచేసి చెప్పిన వాడే వాళ్లమాటలుకూడా నాకు చెప్పాడు. నన్ను తీసుకుపోయి తమ రాజుగారికి చూపి, ఆయనకు నా చిత్రమైన కథ వినిపింతామని వారనుకున్నారట. నేను దానికి సంతోషంగా అంగీకరించాను. తెప్పను ధనపు మూటలతో సహా మోస్తూ వాళ్లు నన్ను రాజుగారి వద్దకు తీసుకుపోయారు.

రాజుగారు నాకు ఆదరంతో స్వాగతమిచ్చాడు. ఆయన కోరినమీదట నా కథ యావత్తూ అయనకు పూసగుచ్చినట్టు చెప్పాను. నేను ప్రాణాలతో బయటపడినందుకాయన నన్ను చాలా అభినందించాడు. నేను నా సంచులు విప్పి, నా కష్టాలకు ఎలాటి ఫలితం లభించినదీ చూపాను.

నేను తెచ్చిన రత్నాలూ, తృణమణులూ మొదలైనవి చూసి రాజుగారు ఎంతో మెచ్చుకున్నాడు. ఆయన గొప్ప రత్న నిపుణుడు.




నేనాయనకు రకానికి ఒక మణి చొప్పున తీసి బహుమతిగా ఇచ్చాను. ఇందుకు ప్రతిఫలంగా ఆయన నాకు చాలా మర్యాదలు చేసి, నన్ను తన రాజభవనంలో అతిథిగా ఉంచుకున్నాడు. ఆ విధంగా నేను రాజుగారి స్నేహమూ, ఇతర సామంతుల స్నేహమూ, సంపాదించ గలిగాను.

వారందరూ నాదేశం గురించీ, బగ్దాద్ పరిపాలన గురించీ అనేక ప్రశ్న లడిగారు. నేను మా ఖలీఫా హారూన్ అల్ రషీద్ గురించి గొప్పగా చెప్పాను. అంతా విని రాజుగారు, "మీ ఖలీఫా చాలా యోగ్యుడని స్పష్ట మవుతున్నది. ఆయన పట్ల నాకు



గొప్ప స్నేహభావం కలిగింది. అందుచేత నీ ద్వారా ఆయనకు తగిన బహుమతి పంపుదా మనుకుంటున్నాను!" అన్నాడు.

"అలాగే ఇవ్వండి. తప్పక ఆయనకు అందజేస్తాను. అంతే కాదు. మీరు చాలా యోగ్యులనీ, స్నేహపాత్రులనీ అయనతో స్నే హ సం బం ధం చేసుకోగలరనీకూడా చెబుతాను," అన్నాను.

వెంటనే రాజుగారు, తాను ఖలీఫాకు పంపదలచిన బహుమతులు తెప్పించాడు. వాటిలో ఒకటి కెంపురాయిలో మలిచిన కూజా. అది వేలిమందాన ఉండి అర అడుగు ఎత్తున్నది. దాని నిండా పోకకాయల ప్రమాణం గల ముత్యాలున్నాయి. మరొక బహుమతి ఒక పెద్ద తివాసీ, అచ్చుగా పాము చర్మంతో చేసినది. ఆ తివాసీలో గల విశేష మేమంటే దానిమీద రోగిష్టివాళ్లు పడుకుంటే వారికి ఆరోగ్యం చేకూరుతుంది. ఇంకొక బహుమతి, రెండు వందల హారతి కర్పూరపు ఉండలు. మిగిలిన బహుమానాలు, రెండు బ్రహ్మాండమైన ఐరావత దంతాలూ, పైనుంచి కిందికి నగలు దిగవేసి అలంకరించిన అందమైన దాసీదీనూ.

ఖలీఫాకు ఇమ్మని ఒక ఉత్తరం ఇస్తూ రాజుగారు, "ఇంత స్వల్ప బహుమానాలు



పంపుతున్నందుకు మీ ఖలీఫాకు నా క్షమాపణలు అందజెయ్యి. నే నాయనను ఎంత మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నానో అయనతో చెప్పు... కాని సింద్‌బాద్, నువిక్కడే ఉండిపోతే నేనింకా ఎంతో సంతోషిస్తాను. నీకు యావజ్జీవం ఏలోపం జరగనివ్వను. మీ ఖలీఫాకు ఈ బహుమానాలు మరెవరి ద్వారానైనా పంపుతాను. ఉండిపోతావేమిటి? చెప్పు!" అన్నాడు.

"నన్ను మన్నించండి, మహారాజా! త్వరలోనే బస్రాకు ఓడ బయలుదేరుతున్నది. నా దేశాన్నీ, నా పిల్లలనూ, నా వారినీ చూడాలని చాలా ఆత్రంగా ఉంది.



నన్ను వెళ్లనివ్వండి. మీ మేలు ఎన్నటికీ మరవను!" అన్నాను.

నన్ను బలవంతాన ఉంచెయ్యాలన్న ఉద్దేశం ఆయనకు లేదు. అందుచేత ఆయన ఓడ సరంగునూ, ఆ ఓడలో ప్రయాణిస్తున్న వర్తకులనూ రావించి, వారికి నన్ను వప్పగిస్తూ వెయ్యి హెచ్చరికలు చేసి, నా కేవు ఖర్చులు తానే ఇచ్చి, నాకు అంతులేని బహుమానాలు అంటగట్టాడు. అవన్నీ ఇప్పటికీ నా వద్దనే ఉన్నాయి.

నేను రాజుగారివద్దా, ఇతర మిత్రుల వద్దా సెలవు తీసుకుని ఓడ యెక్కి, అల్లా కరుణవల్ల, నేరుగా బస్రా చేరి అక్కడి నుండి బగ్దాదుకు వచ్చేశాను. ఓడ దిగుతూనే నేను రాజభవనానికి వెళ్లి ఖలీఫా దర్శనం చేసుకుని, ఆయనకు ప్రణామాలు చేసి. రాజుగారిచ్చిన ఉత్తరం అందించాను.

ఖలీఫా నేను తెచ్చిన ఉత్తరం చదువుకుని బహుమతులు పరీక్షించి, "ఇవి పంపిన రాజు నిజంగా కనిపించినంత ధనికుడేనా?" అని అడిగాడు.

"ప్రభూ, అందు కేమీ సందేహం లేదు. ఆయన ధనవంతుడే గాక న్యాయపరుడు, దక్షత గల పరిపాలకుడు. ఆయన కింద ప్రజలు ఎంత సుఖపడుతున్నారంటే రాజుకూ ప్రజలకూ మధ్య ఏ విధమైన పొరపూ పొచ్చెరమూ లేదు. ఆయన నిజంగా మనకు స్నేహపాత్రుడు, నమ్మదగినవాడు," అని జవాబిచ్చాను.

ఖలీఫా నాకు అనేక బహుమానాలూ, అధికారాలూ ఇచ్చి తన దర్బారు లేఖకులను పిలిపించి నా అనుభవాలన్నీ రాయించాడు. నా కథను ఇతిహాస పత్రాలలో చేర్చమని ఉత్తరు విచ్చాడు.

తరవాత నేను ఇంటికి వెళ్లి నా వారిని కలుసుకుని, ఎంతో గౌరవ మర్యాదలు అనుభవిస్తూ, ఏ లోటూ లేకుండా సుఖంగా కాలం వెళ్లబుచ్చ సాగాను.






# సిరి సంపదలు

పూర్వం దండకారణ్యంలో ఒక ప్రాంతాన్ని కుంభకవనం అని పిలిచేవారు. ఆ వనం కుంభకు డనే రాక్షసుడి దనీ, ఆ రాక్షసుడు ఆ అరణ్యంలోనే ఎక్కడో ఒక చోట, భూగర్భంలో పెద్ద కోట నిర్మించుకుని ఉంటున్నాడనీ జనం చెప్పుకునేవారు. అయితే, ఆ రాక్షసుణ్ణి చూసినవారు లేరు. అతను ఎవరినీ ఎన్నడూ బాధించలేదు. తలవని తలంపుగా అక్కడ నివసించే వారికి మేలు జరుగుతూండేది. కొందరికి బంగారం దొరికేది; కొందరు కట్టెలకోసం వెళితే మామూలు చెట్లమధ్యను అనుకోకుండా చందనంచెట్టు దొరికేది; కొందరు కలప కోసం చెట్టు నరికితే చెట్టుబోదెలలో నగల మూటలుకూడా దొరికాయి. ఇదంతా కుంభకుడి చలవేనని ఆ ప్రాంతాల వుండేవాళ్లంతా అనుకునేవారు. కుంభకుడంటే చాలా మందికి గౌరవభావం వుండేది.

ఈ వనంలో అక్కడక్కడా కుటీరాలు వేసుకుని పేదవాళ్లు జీవిస్తూండేవారు. వారికి కావలిసిన అనేక పదార్థాలు అడవిలో దొరికేవి. కష్టపడి జీవించే వారికి జీవితం సుఖంగానే గడిచేది. అడవిలో ఉండే వాళ్లకు అప్పుడప్పుడూ విచిత్రమైన మనుషులు కనపడేవారు. వారు అడవిలో నివసించే మనుషులు కారు. కాని వాళ్లతో మాట్లాడి, సహాయపడినవారికి త్వరలోనే ఏదో ఒకమేలు జరిగేది. ఆ కనిపించిన మనిషి కుంభకుడేనని అడవిలో నివసించే వారు అనుకునేవారు.

ఈ కుంభకవనంలో కర్దముడనే పేద వాడు ఒక కుటీరం వేసుకుని తన భార్యతోనూ, ఏడాది వయసుగల కొడుకుతోనూ జీవిస్తున్నాడు. అతని భార్య పేరు రేవతి. కొడుకుపేరు గోపాలుడు. కర్దముడు పాతికేళ్ల వయసుగలవాడు. మంచి బలశాలి.

సి. సుందరమ్మ

రోజల్లా కష్టపడి అడవిలో కట్టెలుకొట్టి, కలపకోసీ తన కుటుంబానికి సరిపడినంత సంపాదించుకునేవాడు. అతనికి కావలిసిన ఆహారపదార్థాలన్నీ అడవిలో దొరికేవి. అతనికి భార్యమీదా, కుమారుడిమీదా చాలా ప్రేమ. ప్రతిరోజూ అతను తన పని పూర్తి చేసుకున్నాక ఇంటికి తిరిగివచ్చేటప్పుడు భార్యకోసం సువాసనగల అడవిపువ్వులూ, కొలనులో తామరపువ్వులూ, రుచిగల పళ్లూ కోసి తెచ్చేవాడు.

ఒకనాటి సాయంకాలం రేవతి వంట చేస్తున్నది. కర్దముడింకా అడవినుంచి ఇంటికి వచ్చేవేళ కాలేదు.

"మాకు జీవితం సుఖంగానే వెళ్లిపోతున్నదిగాని, నా భర్త ఇంత కష్టపడటం బాగాలేదు. అసలే శీతాకాలం. పొద్దుపోయి చలికి వణుకుతూ ఇంటికివస్తాడు. మా దగ్గిర పుష్కలంగా డబ్బుంటే ఈ బాధ లేదు గద!" అనుకున్నది. ఆమెకు పొయిలో ఎర్రగాకాలే బొగ్గులు బంగారంలాగా కనపడ్డాయి. "అది నిజంగా బంగారమైతే ఎంత బాగుండును!" అనుకున్నది రేవతి.

సరిగా అదే సమయానికి ఎవరో తలుపు తట్టిన చప్పుడయింది. తన భర్త మామూలుకన్న ముందేవచ్చి ఉంటాడనుకుని ఆమె లేచివెళ్లి తలుపు తీసింది.



బయట ఎవరో ముసలివాడు, భుజాన గోనెసంచిలో ఏదో బరువువేసుకుని నిలబడి ఉన్నాడు. ఆయన చలికి వణుకుతూండటం గమనించి రేవతి, "ఎవరు, తాతా? లోపలికి రా!" అన్నది.

"పుణ్యాత్మురాలివి, తల్లీ! కాస్సేపు పొయిదగ్గిర చలికాచుకోనిస్తివా, కొంచెం సేపుండి నా దారిన నేపోతా! చలికి ఎముకలన్నీ బిగుసుకుపోతున్నాయి," అన్నాడు ముసలివాడు.

ముసలివాణ్ణి లోనికి రానిచ్చి రేవతి బుట్టలోనుంచి కూరలుతీసి ముసలివాడికి కూడా సరిపడేటట్టు వంట ప్రయత్నం సాగించింది. ముసలివాడు మాత్రం పొయ్యికి దగ్గిరిగా చేరి, "మీకంతా సుఖంగా జరుగుతున్నదా, తల్లీ?" అని అడిగాడు.

"జరగకేం, తాతా? ఈ అడవిలో మాకు దొరకనిదేముందీ?" అన్నది రేవతి.

కొంతసేపు గడిచింది. వంట పూర్తి కావచ్చింది. తన భర్త వచ్చేవేళ దాటిపోవటం గుర్తించి రేవతి కారణమేమిటా అని ఆశ్చర్యపడింది.

ఆమె తన మనసులో అనుకుంటున్నది విన్నవాడిలాగా ముసలివాడు, "కర్దముడు రోజూ ఇంత ఆలస్యంచేస్తాడా, అమ్మా?" అని అడిగాడు.







రేవతి నిర్ఘాంతపోయి, "నీ కాయన తెలుసునా ఏమిటి, తాతా ?" అన్నది.

"ఎందుకు తెలీదు, తల్లీ ? ఈ అడవిలో ఉండే అందర్నీ నేను బాగానే ఎరుగుదును. మీ ఇంటిపక్కగా ఎన్నిసార్లు వెళ్లానో!" అన్నాడు ముసలివాడు.

వంట పూర్తి అయిన కొంతసేపటికి కర్దముడు ఇల్లుచేరాడు. ముసలివాణ్ణి చూసి అతను గుర్తుపట్టలేదు, ఆశ్చర్యపడనూ లేదు. అతను భార్యతో, "ఈ పూట మనకు అతిథి ఉన్నట్టుందే? నాకు ఆకలి దహించుకుపోతున్నది. త్వరగా భోజనంపెట్టు!" అన్నాడు వేగిరపడుతూ.

మగవాళ్లిద్దరూ భోజనంచేశాక, ముసలివాడు రేవతితో, "అమ్మా, నీ ధర్మాన ఈ పూటకు ఆకలిబాధ తీరిపోయింది. ఇక నాకు సెలవిప్పిస్తావా ?" అన్నాడు.

వెంటనే కర్దముడు, "ఇంత పొద్దుపోయి అడవిన పడి ఎక్కడికి పోతావు, బాబూ! ఈ రాత్రికి ఇక్కడేపడుకో! అసలే చలిరాత్రులు!" అన్నాడు.

"అవును, తెల్లవారి పోదువులే, తాతా. దాలిపక్కనే చాపవేస్తాను. గొంగళీ ఇస్తాను. వెచ్చగా పడుకో!" అన్నది రేవతి.

ముసలివాడు ఇందుకు సమ్మతించాడు. రేవతి పిల్లవాడికి తిండిపెట్టి తాను తిన్నది. ముసలివాడు కుటీరంలో ఒకమూల పడుకుని త్వరలోనే గుర్రుపెట్టసాగాడు. ఇంకో మూల కర్దముడూ, రేవతీ పిల్లవాణ్ణి పెట్టుకుని పడుకున్నారు.

చీకట్లో తన భర్త నవ్వుతున్నట్టు గ్రహించి రేవతి, "ఎందుకు నవ్వుతున్నావు ?" అని అడిగింది రహస్యంగా.

"ఎందుకా ? ఈ కుంభకుడు చూడు. వాడికేం కర్మవచ్చింది? పాతాళంలో వాడికి ఒకపెద్ద ఊరంత కోట ఉంది. అంతులేని పరివారం ఉంది. అయినా ఈ చలిరాత్రి మన పంచన చేరి, మనం తినేతిండి తిని,





దాలిగుంటపక్కన గొంగళీ కప్పుకుని నేల మీద పడుకున్నాడు !" అన్నాడు కర్దముడు, నిద్రపోతున్న ముసలివాడివేపు చూస్తూ.

రేవతి భయంతో వణుకుతూ, "కుంభకుడా? రాక్షసుడా? ఈ సంగతి తెలిస్తే తలుపే తెరవకపోదునే !" అన్నది.

"వాడికి ఆతిథ్యం ఇవ్వటం మంచిపని చేశావు! వాడు నిజంగా మంచివాడే. తనను బాగా చూసినవారికి ఎంత ఉపకారమైనా చేస్తాడు. నువు వాణ్ణి లోపలికి రానివ్వకపోతే ఏమైనా అపకారంచేసేవాడేమో! భోజనంకూడా పెట్టావుగనక ఇప్పుడే మీ భయంలేదు," అన్నాడు కర్దముడు.

రేవతి ఆ ముసలివాణ్ణి గురించే ఆలోచిస్తూ నిద్రపోయింది.

ఆమెకు మళ్లీ తెలివి వచ్చేసరికి బాగా తెల్లవారిపోయి ఉన్నది. రోజూ తెల్లవారకముందే బయటికివెళ్లే కర్దముడు ఇంకా నిద్రపోతూనే ఉన్నాడు. ఆమె అతన్ని లేపి, "చూడు, ఎంత పొద్దెక్కిందో? మనకన్న ముసలాడే నయం! అప్పుడే లేచి మనకు చెప్పనైనా చెప్పకుండా బయటికి వెళ్లిపోయినాడు!" అన్నది.

"సంచీ వదిలేశాడెందుకో? మనకోసమే వదిలేసి ఉంటాడు! అందులో ఏమున్నదో చూద్దామా?" అంటూ కర్దముడు మూలనున్న సంచీని ఇవతలికి లాగి, దాని మూతికివున్న తాడును విప్పాడు.

ఒక్కసారిగా రేవతికి కళ్లు జిగేలుమన్నాయి. ఏమంటే సంచీనిండా వేలకు వేలు బంగారు మొహిరీలు ఉన్నాయి!

"నేను చెప్పలేదా? ఆ ముసలాడు కుంభకుడే! ఇంకెవరి దగ్గిర ఉంటుంది ఇంత బంగారం? ఇదంతా మనదగ్గిర ఉన్నట్టు తెలిస్తే ప్రమాదం! అందుచేత ఖర్చుకు ఒక వంద మొహిరీలు ఉంచుకుని, మిగిలినవన్నీ చెట్టుకింద పాతేద్దాం!" అన్నాడు కర్దముడు.

భార్యాభర్తలిద్దరూ కలిసి మొహరీల సంచిని ఇంటికి ముందు చెట్టుకింద పాతేశారు. కర్దముడు ఆ రోజున మామూలు వేళకు అడవికి పోలేదు. అతడు ఖర్చు కోసం తీసిన బంగారం పట్టుకుని ఆనంద పడుతూ పట్నానికి బయలుదేరాడు.

రేవతికిప్పుడు పరమానందంగా ఉంది. ఇక తన భర్త ఒళ్లు విరుచుకోనవసరం లేదు; ఎంత ఖర్చుచేసినా తరగని డబ్బుంది. తన భర్త మామూలు వేళకు ఇల్లు చేరక పోతే అడవిలో ఏపాము కరిచిందో, ఏ చెట్టు విరిగి మీద పడిందోనని తాను హడలిపో నక్కర్లేదు, అతను అస్తమానం ఇంట్లోనే ఉండి పిల్లాడితో ఆడుకోవచ్చు, తనతో కబుర్లు చెప్పవచ్చు.

ఆమె ఇంకా చాలా పగటికలలు కన్నది. కలపతో ఇంకా పెద్ద ఇల్లు వేసుకోవాలి. చుట్టూ పూలచెట్లు వేసుకోవాలి. పిల్లవాడికి ఆటవస్తువులూ, బొమ్మలూ, మంచి మంచి బట్టలూ కొనాలి. తనకూ తన పిల్లవాడికీ బంగారు నగలు చేయించుకోవాలి. ఇంట్లోకి వెండిపాత్ర సామగ్రి కొనాలి.

ఆమె ఈ విధంగా అనుకుంటూండగా కర్దముడు బండి మీద తిరిగివచ్చాడు. బండీనిండా ఇంటికి కావలిసిన వస్తువులు అనేకం వున్నాయి.



ఆ వస్తువులు చూసి రేవతికి పరమానందమయింది.

"బండీకూడా కొనేశాను. పట్నం పోవాలంటే ఎట్లాగూ బండి కావలిసిందేగద! ఇంత డబ్బు పెట్టుకుని అంత దూరం ఎవడు నడుస్తాడు?" అన్నాడు కర్దముడు. అతని వాలకం చూస్తే పట్నంలో బాగా తాగి వచ్చినట్టు కనబడ్డాడు.

"తీసుకుపోయిన డబ్బంతా అయిపోయిందా? లేక ఏమన్నా మిగిలిందా?" అని రేవతి అడిగింది.

"అయిపోతే ఇంకా లేదా?" అన్నాడు కర్దముడు కోపంగా.

"ఉంటేమాత్రం; ఉన్నదంతా అట్లా అర్థంలేకుండా ఖర్చు చేసుకుంటారా?" అన్నది రేవతి.

"నన్నడగటానికి నువ్వెవరు? నా యిష్టం! పంతం వచ్చిందంటే నేను బంగారమంతా ఇవాళే ఖర్చుచేసేస్తాను!" అంటూ కర్దముడు ఆమెను తన్నాడు. ఆమె ఎన్నడూ భర్తచేత ఒక్క మాటకూడా పడి ఎరగదు. అతనిలో ఇంత మార్పు వచ్చినందుకు ఆమె విచారించింది. అయినా అతనికి ఎదురు చెప్పటం తనదే తప్పని అనుకున్నది.

అదిమొదలు కర్దముడు రోజూ చెట్టు కింద తవ్వి అంతులేని బంగారం తియ్య





టమూ, బండీ ఎక్కి పట్నానికి పోవటమూ, బండీ పట్టినన్ని వస్తువులు కొనటమూ, తప్పతాగి ఇంటికి రావటమూ చెయ్యసాగాడు.

ఈ వస్తువులు పెట్టుకోవటానికి చోటు లేదు. కుటీరంలో కూచోటానికి చోటు లేదు. ఎన్నో వస్తువులు ఆరుబయట ఉంచెయ్యవలిసి వచ్చింది. అవి ఎండ కెండి, వానకు తడిసి చెడిపోసాగాయి. రేవతి ఏమాత్రం అభ్యంతరం చెప్పినా కర్దముడామెను చితకతన్నేవాడు.

ఐశ్వర్యం హెచ్చినకొద్దీ రేవతికి జీవితంలో సుఖం తగ్గిపోసాగింది. ఇప్పుడు



కర్దముడికి తనమీదా, పిల్లవాడిమీదా కాస్త కూడా ఆపేక్ష లేదు. అతని మనస్సంతా బంగారంమీదా, తాగుడుమీదా ఉన్నది. ఆ బంగారం ఎంత త్వరగా ఖర్చయిపోతుందా అన్నట్టుగా అతను ప్రతిరోజూ అనేక పనికి మాలిన వస్తువులూ, ఖరీదైన వస్తువులూ కొంటున్నాడు.

"ఇంతకన్న ఇదివరకే సుఖంగా ఉన్నాం!" అనుకున్నది రేవతి. తాను ఏదో ఒకటి చెయ్యకపోతే త్వరలోనే తన భర్త మిగిలిన బంగారంకూడా తగలేస్తాడని పించింది. ఆమె అతనితో పోట్లాడింది. "ఈ బంగారం అసలు నీది కానేకాదు. ముసలివాడు నాకోసమే వదిలిపెట్టి పోయాడు. ఇంత ఖర్చవుతున్నదిగాని నాకు కావలిసిన వస్తువు ఒక్కటీ అమరలేదు. అన్నిటికన్న ముఖ్యంగా మనకు పెద్ద ఇల్లు అవసరం!" అన్నదామె.

"నీకేదన్నా కావలిస్తే నన్నడగరాదా? బంగారం నీచేతికిస్తే ఎట్లా ఖర్చుపెట్టాలో నీకు తెలీదు!" అంటూ కర్దముడు పట్నం నుంచి పనివాళ్లను తీసుకువచ్చి లంకంత ఇల్లు కట్టించనారంభించాడు. ఆ ఇల్లు ఎంతకూ పూర్తి అయేటట్టు కనిపించలేదు; ఈ లోపుగా బంగారం తరిగిపోయింది.



కర్దముడు ఇంటో లేని సమయంలో ఒకనాడు రేవతి పనివాణ్ణి ఒకణ్ణి పిలిచి, "ఈ చెట్టుకింద తవ్వు!" అన్నది. వాడు ఎంతోసేపు తవ్వినాకగాని గోతం దొరక లేదు. దానిలో చాలా కొద్ది మొహిరీలే మిగిలివున్నాయి.

"ఇంతేనా?" అన్నది రేవతి అదుర్దాగా, సంచి విదిలిస్తూ. ఆమె భయపడినంతా అయింది. బంగారం అయిపోయింది. బంగారం అయిపోవటమే అయితే అంత ఇబ్బంది ఉండకపోను. అంతకన్న ఘోరమే జరిగింది. ఆ సాయంకాలం తన భర్తకోసం రాజభటులు వచ్చారు. అప్పుడు కర్దముడు తప్పతాగి ఉన్నాడు.

"నీకు నిక్షేపం దొరికిందిట! రాజుగారికి ఎందుకు తెలియజేయలేదు? నిన్ను పెడ రెక్కలు విరిచి కట్టి తెమ్మని రాజుగారి ఉత్తరువయింది!" అన్నారు రాజభటులు కర్దముడితో.

"పెడరెక్కలు విరిచి కడతారుగా?" అంటూ కర్దముడు వారిమీద గొడ్డలితీసు కుని కలియబడ్డాడు. రాజభటులు కత్తులు దూసి కర్దముణ్ణి పొడిచారు. ఇదంతా చూస్తున్న రేవతి కెవ్వున అరిచింది. ఆమెకు స్పృహ తప్పింది.



ఆ మైకంలో ఆమెకు తనను ఎవరో పిలుస్తున్నట్టు వినపడింది. ఆమె కళ్ళు తెరిచి చూసింది.

"రేవతీ, రేవతీ?" అని కర్దముడే ఆమెను పిలుస్తున్నాడు. అప్పుడే తూర్పు తెల్లవారు తున్నది. దాలిగుంటపక్క ముసలివాడు కంబలి కప్పుకుని నిద్రపోతున్నాడు. రాజ భటులు లేరు, ఏమీలేదు!

"ఏమిటి అలా ఏడుస్తున్నావు? పీడకల రాలేదు గద!" అన్నాడు కర్దముడు రేవతిని చూసి నవ్వుతూ.

ఎప్పటిలాగా తన భర్త మళ్లీ కనిపించే సరికి రేవతికి పట్టరాని ఆనందం కలిగింది.

"అవును! చాలా చెడ్డ కల వచ్చింది!" అన్నదామె.

భార్యా భర్తలు మాట్లాడుకుంటూ ఉండగా ముసలివాడుకూడా లేచాడు.

"సూర్యోదయం కాబోతున్నది. నేను బయలుదేరాలి. నాకింత గంజి పొయ్యి," అన్నాడు కర్దముడు.

"తల్లీ, నేనిక వెళ్ళి వస్తాను!" అన్నాడు ముసలివాడు.

"ఉండు, తాతా! నీక్కూడా కాస్త గంజి ఇస్తాను. ఎంత దూరం పోతావో, ఎక్కడ అన్నం తింటావో!" అన్నది రేవతి.

"లేదు, ఇప్పటికే ఆలస్యమైపోయింది," అంటూ ముసలివాడు బయలుదేరాడు.

"తాతా, నీ మూట తీసుకోకుండా పోతున్నావు!" అని కర్దముడు కేకేశాడు.

"అదికూడా ఎందుకులే, బాబూ? మోత చేటు! అందులో మీకు పనికివచ్చేదేమన్నా ఉంటే వాడుకోండి!" అన్నాడు ముసలివాడు.

"నేను చెప్పలేదా? నీకు బహుమానం!" అన్నాడు కర్దముడు రేవతిని చూసి నవ్వుతూ.

ఆమె కంగారుగా, "నాకేమీ వద్దు! తాతను పట్టుకుపోనీ!" అన్నది.

కర్దముడు మూలనున్న మూట ఎత్తి, "అమ్మ, ఎంత బరువుందో! బంగారమేమో?" అన్నాడు.

"వద్దు, వద్దు! మనకున్న సిరిసంపదలు చాలు! పరిగెత్తుకుపోయి ఆ మూటను ఆ తాతకు వప్పగించు!" అన్నది రేవతి మరింత గాభరాతో.

"సరే. నీ యిష్టం!" అంటూ కర్దముడు మూటతో బయటికి వెళ్ళాడు.

రేవతి గుండెమీదినుంచి పెద్ద బరువు దిగిపోయినట్టయింది. వల్లమాలిన సిరి సంపదలవల్ల దుఃఖమేగాని సుఖం లేదని ఆమె తనకు వచ్చిన కలద్వారా అదివరకే బాగా తెలుసుకుని ఉన్నది.






## 9

[గ్రీకులకూ ట్రోజనులకూ భువనసుందరిమూలాన ప్రారంభమైన యుద్ధం అవసానదశకు వచ్చింది. ఉభయపక్షాలా ఉత్తమయోధులు మరణించారు. ట్రోయ్‌ని పట్టుకోవటానికి రూపధరుడు ఒక యుక్తి పన్నాడు. దాని ననుసరించి గ్రీకులు ఒక కొయ్యగుర్రం తయారుచేసి దాని కడుపులో కొందరు యోధులను ఉంచి, గుర్రాన్నీ, చౌర్యనాథుడనే వేగులవాణ్ణీ, సముద్రతీరాన వదలి తమ నౌకలలో వెళ్లిపోయినట్టు నటించారు. ట్రోజనులు ఆ గుర్రాన్ని తమ నగరంలోకి తెచ్చుకుని విజయోత్సాహంలో మునిగి ఉన్నారు.]

బయట ఈ తతంగమంతా జరుగుతూ ఉంటే, గుర్రంలోపల ఉన్న గ్రీకు యోధులు ప్రాణాలరచేత పట్టుకుని గడగడలాడిపోయారు. దోర్దండుడు నిశ్శబ్దంగా ఏడవసాగాడు కూడా. నవయోధు డొక్కడే రాయిలాగా ఉండిపోయాడు. తీక్షదృష్టి విసిరిన బల్లెం కొయ్యగుర్రాన్ని ఛేదించి తన తలకు సమీపంలోనే పొడుచుకువచ్చినా అతను చలించలేదు. పైపెచ్చు, ఎప్పుడు బయటపడి తన పరాక్రమం చూపుదామా అన్నట్టుగా, తన కత్తిపిడిని చేతితో పట్టుకుని. మాటిమాటికీ రూపధరుడికేసి చూడసాగాడు. ఈ దాడికి నాయకుడు రూపధరుడే.

సాయంకాలంవేళ భువనసుందరి తన భర్త అయిన అరిభయంకరుడితో సహా గుర్రాన్ని చూడవచ్చింది. అమె తన భర్తను



రంజింపజేసే మిషమీద గుర్రంచుట్టూ, తిరిగివస్తూ, మధ్యమధ్య దాన్ని తట్టుతూ, గుర్రంలో ఉన్న యోధులలో ఒక్కొక్కడి భార్య గొంతునూ అనుకరించింది. వారిని పేర్లుపెట్టి పిలిచిందికూడా. గుర్రం కడుపులో, రూపధరుడికి సమీపంగా కూచుని ఉండిన ప్రతాపుడూ, దేవమయుడూకూడా, ఆమె తమ పేర్లు పిలిచినప్పుడు లేచి బయటికి ఉరకబోయారు! వారిని రూపధరుడు సకాలంలో వారించాడు.

రాత్రి అయింది. పగలల్లా విజయోత్సవాలు జరిపి అలిసిపోయిన ట్రోయ్ పౌరులు ప్రాణాలు సొమ్మసిల్లి గాఢనిద్రలో మునిగిపోయారు. ఎక్కడా ఒక్క కుక్కకూడా మొరగటంలేదు. ఒక్క భువనసుందరి మాత్రం మేలుకుని ఉన్నది. ఆమె గదికి వెలపల ఒక గుండ్రని దీపం వెలుగుతున్నది. ఇది గ్రీకులకోసం ఏర్పాటుచేసిన సంకేతం.

అర్ధరాత్రి అయింది. చంద్రోదయం కాబోతున్నది. ఆ సమయాన చౌర్యనాథుడు పిల్లిలాగా నగరం దాటి వెళ్ళి, వజ్రకాయుడి సమాధివద్ద అఖండం వెలిగించాడు. అదే సమయాన ప్రత్యామ్నాయుడు, సముద్రం మీద దూరాన వేచిఉన్న గ్రీకునౌకలు బయలుదేరి రావచ్చు నన్నట్టుగా, ఒక దివిటీ ఊపాడు.

సంకేతం అందినట్టుగా రారాజు తమ నౌకలలో దీపాలు వెలిగించాడు. గ్రీకు నౌకలు తీరానికేసి రాసాగాయి.

రారాజు సంకేతం చూస్తూనే ప్రత్యామ్నాయుడు కొయ్యగుర్రం వద్దకు వెళ్ళి చిన్న గొంతుతో, "అంతా సిద్ధం!" అని లోపలివాళ్లకు తెలిపాడు. వెంటనే రూపధరుడు దోర్దండుడితో, "గుర్రం తలుపు తెరిచెయ్యి!" అన్నాడు.

గుర్రం డొక్కలో తలుపు తెరుచుకున్నది. ఒకయోధుడు ఆత్రంగా బయటికి దూకి, మెడ విరిగి అక్కడే చనిపోయాడు. తరవాత తాటినిచ్చెన బయటికి వచ్చింది. గ్రీకుయోధులు ఒక్కొక్కరే నిశ్శబ్దంగా దిగి వచ్చారు. వారిలో కొందరు నౌకలలో వచ్చేవారికోసం కోట ద్వారాలు తెరవటానికి పరిగెత్తారు, మరికొందరు రాజసౌధం వెలపల నిద్రమత్తుతో జోగుతున్న పహరావాళ్లమీదపడి చంపేశారు.

ప్రతాపుడికి తన భార్య అయిన భువనసుందరి ఆలోచన తప్ప మరొక ఆలోచన లేదు; అయన భువనసుందరి ఉండే ఇంటి కేసి పరిగెత్తాడు.

ఆ తరవాత బీభత్సం ఆరంభమయింది. వెన్నెలలో గ్రీకువీరులు వీధులవెంట బయలుదేరి దారుణహత్యాకాండ ప్రారం





ఖించారు. నిరాయుధులజోలికి పోమని రూపధరుడు భువనసుందరికీ, ఆమె అత్త గారికీ మాట ఇచ్చాడేగాని, గ్రీకులు ఈ మాట దక్కించుకోలేదు. వారు ప్రతి ఇంటి లోకీ జొరబడి నిద్రపోతున్న స్త్రీ, వృద్ధుల గొంతులుకూడా కోసేశారు.

వర్ధనుడూ, అయన భార్యా. కూతుళ్ళూ ఒక ఆలయంలో వెళ్లి దాక్కున్నారు. వర్ధనుడు గ్రీకులతో తలపడటానికి సిద్ధమైనాడు గాని ఆయన భార్య బతిమాలింది. "నీవు వృద్ధుడివి. ఇప్పుడు వెళ్ళి ఏమి యుద్ధం చేస్తావు? ప్రాణాలతో ఉండు, అదే పది వేలు!" అన్నది.

వర్ధనుడు భార్య మాటలు మన్నించాడు. కాని అంతలోనే, తన కుమారులలో నే ఒకణ్ణి గ్రీకులు తరుముకుంటూ రావటమూ, నవయోధుడు అతన్ని పొడిచి చంపటమూ ఆయన కళ్లపడింది. ఇది చూసి సహించ లేక వర్ధనుడు అలయంనుంచి బయటికి ఉరికి, గ్రీకులకు దొరికిపోయాడు. గ్రీకులు ఆయనను రాజభవనంవద్దకు ఈడ్చుకు పోయి ద్వారంవద్ద చంపేశారు.

భువనసుందరి ఇంటికి ప్రతాపుడితో బాటు రూపధరుడుకూడా వెళ్ళాడు. ఆ ఇద్దరూ కలిసి అరిభయంకరుడితో చాలా




సేపు యుద్ధం చేశారు. చివరకు భువన సుందరే అరిభయంకరుణ్ణి వెనకపాటున పొడిచింది. అతను చనిపోయాడు.

ప్రతాపుడు తన భార్యను, దొరకగానే చంపుదామనే ఇంతకాలమూ అనుకుంటూ వచ్చాడుగాని ఆమె నవమోహనాకారం చూడగానే ఆయన బుద్ధి మారిపోయింది. ఆయన తన కత్తిని విసిరిపారేసి, భువన సుందరిని చెయ్యిపట్టుకుని తమ నౌకల వద్దకు తీసుకువెళ్ళాడు.

ప్రత్యామ్నాయుడు ట్రోజను అయివుండి కూడా గ్రీకులకు తోడ్పడినవాడు. ఈ సంగతి మరిచిపోయి కొందరు గ్రీకులు ప్రత్యామ్నా




యుడు కొడుకులలో ఒకణ్ణి గాయపరిచారు. మరొకణ్ణి చంపటానికి వీధులవెంట తరమ సాగారు. ఈ సమయంలో రూపధరుడు అడ్డపడి ప్రత్యామ్నాయుడి కొడుకులను కాపాడటమే గాక, ప్రత్యామ్నాయుడి ఇంటి ద్వారానికి ఒక చిరతపులి చర్మం వేల గట్టించాడు. గ్రీకులు ఆ యింటిజోలికి పోకూడదనటానికి అది గుర్తు. ఇదేవిధంగా ప్రశంసనుడి ఇల్లుకూడా గ్రీకుల ఆగ్రహానికి గురికాకుండా వదలివేయబడింది.

ట్రోయ్‌నగరంలో గ్రీకులు హత్యాకాండ ఆరంభించగానే, వర్ధనుడి పెద్దకుమార్తె అయిన జాలిని బుద్ధిమతీదేవి ఆలయానికి



పరిగెత్తిపోయి దాక్కున్నది. కాని గ్రీకులు ఆమెను పట్టుకుని తీసుకుపోయినారు. ప్రాణాలతో చిక్కిన ట్రోజను స్త్రీలందరూ గ్రీకులకు ఉంపుడుగత్తెలు కావటం తప్ప గత్యంతరంలేదు. జాలినిని రారాజు తన ఉంపుడుగత్తెగా ఎన్నుకున్నాడు.

హత్యాకాండ ముగిసినాక గ్రీకులు ట్రోయ్ నగరాన్ని కొల్లగొట్టారు, గోడలు పడగొట్టారు, ఇళ్లకు నిప్పుపెట్టారు, దేవతలకు బలులు పెట్టారు. దోచినదెల్లా పంచుకున్నారు.

వీరసింహుడి భార్య నవయోధుడి వంతు అయింది. ఆమె కొక పసిపిల్లవాడున్నాడు. వాణ్ణి గ్రీకు యోధులందరూ కూడబలుక్కుని రహస్యంగా చంపేశారు.

వజ్రకాయుడు ప్రేమించిన ప్రమోదిని భవిష్యత్తుగురించి గ్రీకులమధ్య కొంత వాగ్వాదాలు జరిగాయి. "ట్రోయ్ పతనమైన తరవాత ప్రమోదినిని నా సమాధివద్ద బలి ఇవ్వండి!" అని చనిపోతూ వజ్రకాయుడు తన మిత్రులను కోరిఉన్నాడు. అతను ఇటీవల తన కొడుకుకూ, మరి కొందరు గ్రీకులకూ కలలో కనిపించి, ప్రమోదినిని బలి ఇవ్వకపోతే గ్రీకు బలాలకు స్వదేశానికి వెళ్లే ప్రాప్తి లేకుండా చేస్తానని బెదిరించాడుట.







అంతగా ప్రేమించిన ప్రమోదినిని వజ్రకాయుడికి అర్పించకపోవటం అపచారమవుతుందని కాంశుకుడు అన్నాడు. కాని రారాజు ప్రమోదిని బలికి పూర్తిగా వ్యతిరేకించాడు. "ఇప్పటికే చాలా రక్తపాతం జరిగింది! అదీగాక చచ్చిపోయినవాడి హక్కులను బతికిఉన్న స్త్రీతో ముడిపెట్టటమేమిటి? ఇది చాలా అసంగతంగా ఉన్నది," అని ఆయన వాదించాడు.

"నీవంతు వచ్చిన జాలినిని తృప్తిపరచటానికై, ఆమె చెల్లెలి ప్రాణాలకు అడ్డుబడుతున్నావు!" అని కొందరు గ్రీకులు రారాజును బహిరంగంగా ఆక్షేపించారు. వాదం కాస్తా తగాదాగా మారింది. ఇంక ప్రమాదం జరుగుతుందని రూపధరుడు అడ్డుతగిలి, మిగిలినవారి ఇష్టానుసారం జరగనిమ్మని రారాజుకు సలహా ఇచ్చాడు.

ప్రమోదినిని బలి ఇవ్వటం ఖాయమయింది. ఆమెను తీసుకువచ్చే పని రూపధరుడికే వప్పజెప్పారు. బలికర్తగా వజ్రకాయుడి కొడుకు నవయోధుడే స్వయంగా నిలబడ్డాడు. గ్రీకు సైనికులందరి సమక్షంలో, వజ్రకాయుడి సమాధివద్ద, ప్రమోదిని బలి చేయబడింది. తరువాత ఆమెకు గ్రీకులు శాస్త్రోక్తంగా అంత్యక్రియలు జరిపారు.



ప్రమోదిని చనిపోగానే గాలులు గ్రీకుల తిరుగు ప్రయాణానికి అనుకూలంగా వీచాయి. ప్రమోదిని హత్యతో వజ్రకాయుడి ఆత్మ శాంతించిందనీ, అతనే ఆ గాలిని పంపి తమకు సాయపడ్డాడనీ గ్రీకులు భావించారు. వారు కాలయాపన కాకుండా, వెంటనే తమ నౌకలలో ఎక్కి తిరుగు ప్రయాణంమీద బయలుదేరారు.

వర్ధనుడి భార్య రూపధరుడివంతు అయింది. కాని ఆమె గ్రీకుల అవినీతికి కడుపుమండి రూపధరుడు మొదలైనవారినందరినీ ఘోరంగా శాపనార్థాలు పెట్ట సాగింది. ఏ విధంగానూ ఆమె నోరు మూయ



లేక గ్రీకులు ఆమెను చంపి సముద్రంలో పారేసి ముందుకు సాగివెళ్లారు.

తిరుగుప్రయాణంలో గ్రీకుప్రముఖులు తలా ఒకదారీ అయినారు. వారిలో కొందరు తమ దేశాన్ని చేరనేలేదు.

ట్రోయ్‌నుంచి కదిలిపోయే ముందు రారాజుకూ, ఆయన తమ్ముడైన ప్రతాపుడికీ మధ్య తగాదా వచ్చింది. "గాలి అనుకూలంగా ఉన్నది, వెంటనే ప్రయాణమవుదాం!" అన్నాడు ప్రతాపుడు. "బుద్ధిమతీదేవికి బలు లివ్వకుండాపోతామా?" అన్నాడు రారాజు. "బుద్ధిమతీదేవి మనకేం ఒరగ బెట్టిందని బలులిస్తాం? ఆమె మన శత్రువులకే తోడ్పడింది!" అన్నాడు ప్రతాపుడు. ఆ తగాదాలో ఇద్దరూ చీలిపోయారు. వారు తిరిగి జీవితంలో కలుసుకోనేలేదు.

రారాజూ, నవయోధుడూ, వృద్ధుడైన నవద్యోతుడూ, నేరుగా ఇంటికి తిరిగి వెళ్లారు. ప్రతాపుడుమాత్రం గాలి అనుకూలించక తుపానులో చిక్కుకుని, తన నౌకలను చాలాభాగం పోగొట్టుకుని, ఈజిప్టు తీరం చేరి, అనేక సంవత్సరాల అనంతరం భువనసుందరితో సహా ఇల్లు చేరేలోగా రారాజును ఎవరో హత్య చేసేశారు.

ట్రోయ్‌యుద్ధం అఖరుదశలో కొయ్యగుర్రం పథకం ఆలోచించి, ట్రోయ్ పతనం కావటంలో గొప్ప పాత్ర నిర్వహించిన రూపధరుడు ఇంటికి చేరటానికి పదేళ్లు పట్టింది. అతని ప్రయాణాలు అతి విచిత్రమైనవి.

ఈ విధంగా ట్రోయ్‌నగరం పతనమయింది. గ్రీకులు ధ్వంసం చెయ్యక పూర్వం అది ప్రపంచంలో గల ఉత్తమ నగరాలలో ఒకటి. గ్రీకులు నాశనం చేసిన అనంతరం దానిని పునర్నిర్మించి ఎందరో రాజులు—ప్రశంసనుడి సంతతివారు—ఏలారు గాని, దాని పూర్వపు ఔన్నత్యం ఎన్నడూ తిరిగి రాలేదు.

[అయిపోయింది]





# పోటీ కానుక

పూర్వం ఒక రాజుగారికి ఒక రైతుస్నేహితు డుండేవాడు. రాజుగారు వేటకు వెళ్లినప్పు డల్లా ఈ రైతు ఇంట ఒక పూట ఉండి, చిలగడ దుంపలు కాల్పించుకు తిని, తన నగరానికి తిరిగివస్తూ ఉండేవాడు.

ఇలా ఉండగా రైతు ఒకనాడు రాజ ధానికి వెళ్లవలసి వచ్చింది. రైతు భార్య ఒక కట్టెడు చిలగడ దుంపలు మూటగట్టి ఇచ్చి, "రాజుగారికి చిలగడ దుంపలంటే మహా యిష్టం! వీటిని తీసుకుపోయి ఆయ నకు కానుకగా ఇయ్యి!" అన్నది.

"ఓసి పిచ్చిదానా, రాజుగారు ఇటువంటి కానుకలను చూసి ఏమనుకుంటారు?" అన్నాడు రైతు తన భార్యతో.

"ఇంత దూరంనుంచి నువు తీసుకు పోయినందుకు వారు తినకపోతారా ఏమిటి? ఫరవాలేదు లే! ఏమీ అనుకోరు, పట్టుకెళ్లు!" అన్నది రైతు భార్య.

భార్య మాట ఎందుకు తీసెయ్యాలని రైతు చిలగడ దుంపల మూట ఎత్తుకుని రాజధానికి బయలుదేరాడు. దారిలో అతడు తన మూటలో నుంచి చిన్న చిన్న దుంపలు ఏరి కొరికి తింటూ నడవసాగాడు. తీరా అతడు రాజధానికి చేరేసరికి మూటలో ఒకే ఒక చిలగడదుంప, బాగా పెద్దది, మిగిలింది.

"దీనిని రాజుగారి కిస్తాను. ఆయన ఎన్నడూ ఇంత పెద్ద దుంప చూసి ఉండడు!" అనుకున్నాడు రైతు.

రాజుగారి దర్శనంకోసం రైతు రాజసభ వద్దకు వెళ్లి తొంగి చూశాడు. లోపల సభ జరుగుతున్నది. రైతు బయట నిలబడ్డాడు. కొంతసేపటికి సభ ముగిసింది. రాజుగారు బయటికి వచ్చి తన స్నేహితుడైన రైతును చూసి పలకరించి, కుశల ప్రశ్నలు చేశాడు. రైతు మూటలోనుంచి చిలగడ దుంప తీసి, "తమకోసం తెచ్చాను!" అన్నాడు.

బి. శ్రీకాంతరావు

రాజు పరమానందంతో చిలగడ దుంపను తీసుకుని, పక్కనే ఉన్న భటుణ్ణి పిలిచి, "ఒరే ఈ బహుమానాన్ని మన ఖజానాలో భద్రం చేయించు. తరవాత, కోశాధికారి నడిగి వెయ్యి మొహరీలు తెచ్చి ఈ రైతుకు బహుమానంగా ఇయ్యి!" అన్నాడు.

తరవాత రాజుగారు రైతుకేసి తిరిగి, "మనం భోజనానికి పోదాం పద!" అన్నాడు.

ఎవరో ఊరూ పేరూ లేని రైతొకడు ఒక చిలగడదుంప తెచ్చి ఇస్తే రాజుగారు వాడికి వెయ్యి బంగారు మొహరీలు బహుమతి ఇవ్వటమేగాక, తనతోబాటు భోజనంకూడా పెట్టి పంపాడని రాజసభలో ఉండే వారి కందరికీ తెలిసిపోయింది.

రాజుగారు ఇంత దాత అయినప్పుడు లాభం ఎందుకు పొందగూడదనే ఉద్దేశంతో, ఒక సభికుడు మర్నాడు ఉత్తమజాతి గుర్రాన్ని ఒకదాన్ని కొని రాజుగారి వద్దకు తెచ్చి, "మహారాజా, ఈ మేలుజాతి అశ్వాన్ని తమకు కానుకగా ఇచ్చుకుంటున్నాను, అనుగ్రహించండి!" అన్నాడు.

ఒక్క చిలగడదుంపకే వెయ్యి మొహరీలిచ్చినవాడు ఈ గుర్రానికి ఇంకెంత బహుమతి ఇస్తాడోగదా అని సభికుడు ఆశపడ్డాడు.

ఈ సంగతి రాజుగారు గ్రహించాడు. ఆయన తన పక్కనే ఉన్న భటుణ్ణి పిలిచి, "ఒరే, మన ఖజానాలో దాచమని ఒక చిలగడగుంప పంపాను, దాన్ని తీసుకురా!" అని వాడి చెవిలో రహస్యంగా చెప్పాడు.

భటుడు వెళ్లి త్వరలోనే చిలగడదుంపతో తిరిగి వచ్చాడు. రాజుగారు ఆ చిలగడ దుంపను సభికుడికి ఇస్తూ, "వెయ్యి మొహరీలు చేసే చిలగడదుంప! నాకు నువు గుర్రం కానుకగా ఇచ్చినందుకు నేను దీన్ని నీకు బహుమతి చేస్తున్నాను!" అన్నాడు.

సభికుడి ఆశ నిరాశ అయిపోయింది. అతని దురాశకు తగిన శాస్తి జరిగిందని సభికులు తమలో తాము చెప్పుకున్నారు.





# మిత్రభేదం

ఒంటె - కాకి కథ :

సరి యని ఆ కథ - సంజీవకుండు
స్థిరబుద్ధి నిటు వచిం-చెను మెల్లమెల్ల
అనగననగా నొక్క - అడవి, సింహమ్ము
తన రాజ్యమును సేయు - తరుణమ్మునందు
తన బిడారును తప్పి - చనిన ఒంటొకటి
వనిలోన జొచ్చి రా-జును చేరియుండె.
ఒకసారి మదగజ - మ్మొకటి సింహమ్ము
కకవిక చేసిన - కదలాడలేక
పడియున్న సింహమ్ము - పథ్యమ్ము లేక
కడనున్నవానిని - కానకు బంపె.
కాకి నక్కయు వెను-కకు వచ్చి పలికె
ఏకడ నే మాంస-మేని కన్పడదు
విపినమ్ములో మీరు - వేటాడలేరు
తపియింతు రెట్లు ప-థ్యముకూడ లేక.
అని ఒంటె జంపిన - ఆహారచింత
మన కుండదన్న సిం-హము కోపగించి
అభయమిచ్చినదాని - హత్య పాపమ్ము
శుభము కాదెప్పుడు - చూడు డింకేదొ.
అని గదిరించిన - నవి యుక్తి పన్ని
ఘనులు రాజులు మిమ్ము - కాపాడవలయు
నన్నుచంపి తినుండు - నన్నె నక్క.
అన్నన్న ! మాంసాశు - లన్న సోదరులు
చంపకూడ దటంచు - చంపుడు నన్ను
చంపు డన్నది పులి - సరి అది తప్పు
నన్ను చంపు డటంచు - నా కాకి అన్న
చిన్నదానవు చాల - వన్నది నక్క.
అపుడు మాటకెకదా - అనునివి అనుచు
విపరీత మెంచక - వెఱ్ఱిదౌ ఒంటె
నన్ను చంపుండని - అన్నదో లేదొ
విన్నంతనే అవి - విఱుచుక పడియె
నీచు లీవిధముగా - నీతి మాలెదరు
రాచవారికి వారె - రక్తులయ్యెదరు
అనుచు సంజీవక-మ్మా కథ చెప్పె.
మనరాజు చెవిలోన - మంత్రించె నెవడొ
చెప్పుడు మాటలు - చెఱచు నందఱను

విద్వాన్ విశ్వం




ఇప్పుడు నేనింక - ఇట నుండుటెట్లు ?

దమనకుడు :

అయినచో వెళ్ళరా-దా ఎటకైన

సంజీవకుడు :

భయము తీరునె? పోయి - బ్రదుకుట యెట్టు
పెద్దలతో పగ - వెడలిననెందు
నిద్దుర పట్టునా - నీ తెల్వి మండ ?

దమనకుడు :

అయిన నీవీ దొర - నణచగా లేవు
నియమమ్ము సములతో - నేస్తము పగయు
పిచ్చుకతో పగ - పెంచుక మున్ను
పిచ్చి సంద్రము చేటు - పెంచుకో లేదె ?

సంజీవకుడు :

అది యేమి కథ మిత్ర-మా ఎట్లు జరిగె



విదితమ్ము సేయుము - వేడుక కలుగ.

పిచ్చుక కథ :

చెప్పెద విను మయ్య - చెవి యొగ్గి వినుము
అప్పుడెప్పుడొ సము-ద్రాంతికమందు
రెండు పక్షులు వాస - ముండెను జతగ
అండమ్ములను వెట్టు - నదనున పెంటి
దూరమ్ము పోదమీ - వారిధినుండి
నీరధి తరగల - నేలను దాకు.
అన్నంత మగపక్షి - అక్కఅలేదు
మిన్నందు మనకేల - మెలకువలనెను.
విని సాగరము దీని - వెఱ్ఱి కుదుర్తు
నని గూడుపూర్తి లా-గెను కోపమునను
అది చూచి పెంటి యి-ట్లన్నది చూడు
మదమున హితవును - మంట గల్పితివి.
మాటను వినక ను - మ్మ పుడు తాబేలు
నోటపట్టిన పుల్ల - నోనాడి చెడియె
మాటను వినకయే - మత్స్యముల్ మూడు
దాట నేరకపోయె - తమ కష్టములను
బలవంతులైనట్టి-వారితో కక్ష
చలపట్టి సంసార-ములు గూల్చు నిజము
బలహీను లెప్పుడు - బహుమంది కలిసి
బలవంతులనుకూడ - పరిమార్చవచ్చు.
అని చింతచేసి ఆ - అండజద్వయము
తన జాతి నాధుని - తలచినయంత
గరుడుడు సంగతి - కనుగొని వచ్చి
ఊరు సముద్రమ్మునే - ఊపి ఏడ్పించి





పిచ్చుక గుడ్లను - పెకలించి తెచ్చి
పిచ్చుక జత కిచ్చె - ప్రేమతో మున్ను
కావున సంజీవ-కా వద్దు పోరు
నీవు కావలెనన్న - నేర్పుతో నడువు.

సంజీవకుడు :

మరి దొర నను జంపు-మాటలో నిజము
ఎరుగుట యెట్లు నా - కెరిగింపు మింక

దమనకుడు :

దాని కేమున్నది - తప్పక నిన్ను
అనక కోపమ్ము-తో నీక్ష సేయు
ఆ రీతి కనుగొని - అది కనుగొనుము
ఈ రహస్యము చెప్ప - కేరికిగూడ
అని నక్క సంజీవ-కుని వీడి, కరట
కుని చెంత కతిగి తా - వినిపించె నెల్ల:

దమనకుడు :

"చెడిపితి వారల - స్నేహమ్ము నెల్ల
విడిపోయినా రింక - కడచె నా గాథ"

కరటకుడు :

నేస్తుల యెడబాపు - నీతి కాదయ్య
వాస్తవమ్మన కది - వక్ర మార్గమ్ము
పగ తేపుటది సుల-భమ్మె లోకమున
సగ బెట్టుటది కష్ట-సాధ్యమ్ము మనకు
చెట్టును పడగొట్టు - శక్తియే కాని
చెట్టు నెత్తగలే ది-సీ పెద్ద గాలి.

దమనకుడు :

పాడి యెఱుంగక - పల్కెద విట్లు
చీడగా శత్రుని - చెఱపనే వలయు



మన మంత్రిపదవిని - మసిజేసి వీడు
మనకు శత్రుండయ్యె - మాయావి కాడె
కావున వానిని - కడముట్ట జేయు
టే విధి తప్పు కా - దేల యీ వాదు?
కత చెప్పినట్లుండె - కావున వినుము
చతురకుం డనువాని - సామ్యము వినవె?

కరటకుడు :

ఏమిటా కథ విన-నిచ్ఛ జనించె
ధీమంతుడా చెప్పు - మేమిటా వార్త?

దమనకుడు :

కల దొక్క అడవి అం-దుల మృగరాజు
సులభుడు ప్రజదం-ష్ట్రుండనువాడు
చతురకుండను నక్క - సచివు డాతనికి
జత క్రవ్యముఖుడను - సచివ వృకమ్ము.



ఒకనాడు సింహ మే-దో వేట కఱుగ
ఒక చోట కనుచున్న - ఒంటె కాన్పించె
ఒంటెను చంపి లో-నున్న బాలకుని
ఇంటికి తెచ్చి మృ-గేంద్రమ్ము సాకె.
దొర, మంత్రు లిద్దఱు - తరుణుడు వీడు
సరిసమానమ్ముగ - చనవుతో దిరుగు
నలుగురు మిత్రులై - నానా విధముల
కలత లెఱుంగక - కాలమ్ము గడప
ఒకసారి సింహ మెం-కొక యేను జెనకి
వికలాంగమై యుండె - వేటాడలేక
మఱి మంత్రు లెల్లెడ - తిరిగి వేసారి
తరణోష్ట్రమును చంపి - దొరకిచ్చినారు.
సరి నీట మునిగి వే-గిర మిదే వత్తు
తరువాత తింద మీ - వర మాంస మనుచు
మృగపతి యరిగిన - వృకము నీక్షించి
చతురకుం డిట్లనె - చాతుర్య మొప్ప.
అకలి గొంటివా - అయ్యో కాసంత
పీకిన నేమిలే - వెఱవక తినుము
ఆ మాట విని నిజ-మ్మనుచు తోడేలు
ఆ మాంస మొక్కింత - అటునిటు కదిపె
ఈ లోన సింహమ్ము - నేతెంచి చూచి
ఏలొకొ యిది యెల్ల - యెంగిలై పోయె
అని కోపగింపగా - అటు మంత్రి జూపె
పనిగొని నక్క వెం-టనె వృకమ్మెఱిగి
పరువెత్తి పోయె ఆ-తరుణమ్మునందె
దఱి దాపు సందేగు - సరుకు బిడారు
ఒంటెకు మెడలోన - నుంచిన గంట
కంటికి కనరాక - గణగణ మ్రోగె.
అద నిది యని నక్క - అనె : ధర్మరాజు
బెదిరించుచును వచ్చె - పిల్ల ఒంటియను
చంపితివని నిన్ను చంపు నాతండు"
కంపించి సింహమ్ము - గట్టి మాటంచు
పారిపోయెను దూర-దూరమ్ముగాను
తీరె బాధ యటంచు - తెంపఱి నక్క
కడుపు నిండఁగ తిని - కలవరమ్ముడిగె
తడయక సులువుగా - తన పని చేసె.





# తోడేలు దుర్మరణం

కుందేలును నక్కకు పట్టివ్వటానికి తోడేలు చేసిన ప్రయత్నం కాస్తా వృథాఅయిపోగానే తోడేలుకు కుందేలు మీద ఎక్కడలేని ఆగ్రహం వచ్చింది. అది కుందేలుమీద పగబట్టి, కుందేలు కుటుంబాన్ని సర్వ నాశనం చేయబూనుకున్నది.

కుందేలు ఎక్కడైనా వెళ్లితే చాలు, తోడేలు పొంచివుండి ఇంట్లో ప్రవేశించి కుందేలు పిల్లలలో ఒకదాన్ని తిని వెళ్ళిపోయేది. ఇలా ఒకటి రెండు సార్లు జరిగాక కుందేలుకు మనశ్శాంతి లేకుండా పోయింది.

కుందేలు తన ఇంటికి మరమ్మత్తులు చేయించి, తలుపులకు గట్టి గడియలు పెట్టించి, తోడేలు అట కొంతవరకు కట్టించింది. పిల్లలు దాక్కునేటందుకు పెట్టెలు చేయించి వాటికి బీగాలు అమర్చింది.

తోడేలుకూడా కుందేలు చేసిన బందోబస్తు గమనించి, తన పగ తీర్చుకునేటందుకు అవకాశం ఎట్లా సంపాదించాలా అని ఆలోచించ సాగింది.

ఆలోచించగా ఆలోచించగా దానికొక గొప్ప ఉపాయం తట్టింది. ఒకనాడు, అది పరిగెత్తుకుంటూ కుందేలు ఇంటికి వెళ్ళి, దబదబా తలుపు తట్టింది.

"ఎవరు వారు?" అన్నది కుందేలు.

"నేను తోడేలును, తమ్ముడూ! చప్పున తలుపు తియ్యి, నీకు పుణ్యం వుంటుంది! నన్ను వేటకుక్కలు తరుముకొస్తున్నాయి!" అన్నది తోడేలు ఆదుర్దాగా.

తన పిల్లలను అవతలి గదిలో దాచి, కుందేలు తలుపు తెరిచింది. తోడేలు మట్టి కొట్టుకుని, రొప్పుతూ లోపలికి వచ్చింది.

కుందేలు వాకిలి పక్కనే ఉన్న పెట్టె మూత తెరిచి, "ఇందులో దాక్కో, అన్నా. వేటకుక్కలు యిక్కణ్ణించి వెళ్లిపోగానే బయటికి వద్దువుగాని!" అన్నది.

టి. శంభుదాసు



తన ఎత్తు పారిందని సంతోషిస్తూ తోడేలు పెట్టెలోకి వెళ్ళింది. కుందేలు పెట్టెమూసి బీగం బిగించింది. తరవాత తన పిల్లలందరినీ బయటికి తీసింది. పిల్లలు ముందు గదికి వచ్చి ఆడుకోసాగాయి.

తోడేలు పెట్టెలోనుంచి, "తమ్ముడూ, కుక్కలన్నీ వెళ్లిపోయాయేమో చూస్తావా?" అని కేక వేసింది.

"ఇంకా ఒక కుక్క వాకిలి దగ్గిర వాసన చూస్తున్నదే!" అన్నది కుందేలు, నవ్వవద్దని తన పిల్లలకు సంజ్ఞచేస్తూ.

కుందేలు అటూ ఇటూ తిరుగుతూ ఏదో పనిమీద ఉన్నట్టు పసికట్టి, తోడేలు, "ఏం చేస్తున్నావు, తమ్ముడూ?" అని అడిగింది.

"నిప్పు చేస్తున్నాను!" అన్నది కుందేలు.

"దేనికి, తమ్ముడూ?" అన్నది తోడేలు.

"నీకు కాస్త టీ పోద్దామని!" అన్నది కుందేలు. మరి కాస్సేపుండి తోడేలు, "ఆ చప్పుడేమిటి, తమ్ముడూ?" అన్నది.

"నీళ్లు తెర్లటం!" అన్నది కుందేలు.

ఇంకొంచెం సేపుండి తోడేలు కంగారుగా "పెట్టెను ఏమిటి చేస్తున్నావు, తమ్ముడూ?" అని అడిగింది.

"నీకు ఊపిరి ఆడటానికై పైమూతలో చిల్లులు పెడుతున్నాను!" అన్నది కుందేలు.

మరి కాస్సేపుండి తోడేలు బాధగా, "అమ్మో! ఏమిటో చురుకు చురుకు మంటున్నాయి, తమ్ముడూ!" అన్నది.

"గోమార్లయి ఉంటాయి. రెండో వేపుకు పొర్లు!" అన్నది కుందేలు.

తోడేలు రెండో వేపుకు పొర్లింది, కాని ఏమీ లాభం లేకపోయింది. పెట్టెమూతలో చేసిన కంతలలోనుంచి కుందేలు సలసలా కాగే నీళ్ళు పోయసాగింది. తోడేలు కొంత సేపు గిలగిలా కొట్టుకుని చివరకు పెట్టెలోనే ప్రాణాలు విడిచింది.

ఆ విధంగా కుందేలుకు తోడేలు పీడ విరగడ అయింది.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

**1957 ఆగష్టు సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు**






★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూన్ నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : బందీలో విందుకన్నా...

రెండవ ఫోటో : ...బయలులో నీరు మేలు!

పంపినవారు : కె. ఎస్. నారాయణమూర్తి, అసిస్టెంట్ ఇన్స్‌పెక్టర్ ఆఫ్ వర్క్స్, ఫర్నిషింగ్ యూనిట్, ఇంటెగ్రల్ కోచ్ ఫ్యాక్టరీ, మద్రాసు - 23.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

రథచక్రము



గంధపు గిన్నె





కూజా



పుష్పకం

ఆర్. వెంకటలక్ష్మి, కడప

# పక్షులు

ఎగిరేవన్నీ పక్షులు కావు, వాటిలో పక్షులు కానివికూడా ఉన్నాయి. వాటికి వెన్నెముకలుంటాయి. నిజమైన పక్షులకు వెన్నుముకలుండవు. దయ్యపు బల్లులు జీవించిన కాలంలో అనేక రకాల "ఎగిరే సరీసృపాలు" ఉండేవి. కాని ఈనాడు అలాటివి లేవు. ఇప్పుడు ఎగిరే వాటిలో నూటికి 99 కి పైగా పక్షులే. గబ్బిలాలు నిజమైన పక్షులు కావు.

ఎగిరేవన్నీ పక్షులు కానట్టుగానే, పక్షులన్నీ ఎగరలేవనీకూడా మనం తెలుసుకోవాలి. ఇలాటి ఎగరలేని పక్షులు మానవులకు పూర్వంకూడా ఉండేవి. వీటికి ఉదాహరణ నిప్పుకోడి.

అయితే సాధారణంగా పక్షి అన్న తరవాత అంతో ఇంతో ఎగిరే శక్తి దానికి ఉంటుంది. కొన్ని పక్షులు కొద్ది దూరమే ఎగరవచ్చు, మరి కొన్ని చాలా దూరం ఎగరవచ్చు; కొన్ని పక్షులు తక్కువ వేగంతో ఎగరవచ్చు, మరి కొన్ని హెచ్చు వేగంతో ఎగరవచ్చు. రోబిన్ అనే పక్షి గంటకు సుమారు 30 మైళ్ళ వేగంతో ఎగురుతుంది. చిమ్నీ స్విఫ్ట్ అనే మరొక పక్షి 60 మైళ్ళకు పైబడిన వేగంతో ఎగురుతుంది.

పక్షులు ఎగరటానికి రెక్కలు అవసరమని మనకు తెలుసు. రెక్కల వెంట బలమైన కండరాలుంటాయి. పక్షి రొమ్ము ఎముకమీద ఎత్తుగా ఉండే "దూలం"కు ఈ కండరాలు తగిలి వుంటాయి. ఎగిరేటప్పుడు పక్షి తన రెక్కలతో గాలిని కొట్టి ముందుకు పోతుంది.

ఒకే ప్రమాణం గల పక్షినీ మృగాన్నీ తూచినట్టయితే పక్షి తేలికగా ఉంటుంది. దీనికి కారణమేమంటే పక్షుల ఎముకలు డొల్లగా ఉండి, గాలితో నిండివుంటాయి. ఇంతేగాక పక్షుల శరీరాల నిండా చిన్న చిన్న గాలితిత్తులుంటాయి; ఊపిరితిత్తులనుండి వీటిలోకి గాలి వస్తుంది. ఈ కారణంచేత పక్షుల శరీరాలు, మృగాల శరీరాలతో పోల్చితే, చాలా తేలికగా



ఉంటాయి. శరీరం తేలికగా ఉండటం పక్షి ఎగిరేటందుకు ఎంతో తోడ్పడుతుంది. వాటి శరీరాల అకృతికూడా ఎగరటానికి అనువుగా ఉంటుంది.

ఈకలు పక్షులకు అనేక విధాల ఉపయోగపడతాయి. అవి శరీరాన్ని కప్పి ఉంచుతాయి. వాటివెంట కొద్దిపాటి నూనెపదార్థం ఉండటంచేత వాననీరు పక్షుల శరీరాలనుంచి సులువుగా జారిపోతుంది.

ఇంతేగాక, పక్షులు ఉష్ణరక్త ప్రాణులు. అంటే వాటి శరీరాల వేడి వాతావరణానికి అనుగుణంగా మారదు. అందుచేత వాటి శరీరాల వేడిని చలినుంచి కాపాడాలి. ఇందుకుగాను ఈకలు ఎంతో ఉపకరిస్తాయి.

విధిగా ప్రతి పక్షీ గుడ్డునుంచే పుడుతుంది. ఈ గుడ్లమీది పెంకు దళంగా ఉంటుంది. అయితే పక్షియొక్క జాతినిబట్టి గుడ్డు ప్రమాణం మారుతుంది. ఉష్ట్రపక్షి గుడ్డు నిడివి ఆరు అంగుళాలుంటుంది; పిచ్చుక గుడ్డు చిన్న గోలికాయ ప్రమాణమే ఉంటుంది.

పక్షులు గూళ్ళలో గుడ్లు పెడతాయి. గూళ్ళను నిర్మించటంలో ఒక్కొక్క పక్షి ఒక్కొక్క రకం చాకచక్యాన్ని ప్రదర్శిస్తుంది. గిజ్జిగాడి గూడు అతి విచిత్రంగా ఉంటుంది. కాని ఈ గూళ్లు కట్టే చాకచక్యం పక్షులకు జన్మతహా రావలసిందేగాని నేర్చుకునేది కాదు. ఒక పక్షి గూడు కట్టినట్టు మరొకటి కట్టదు. అనుభవం గలవాళ్ళు గూడు చూసి పక్షిని చెప్పెయ్యవచ్చు. సాధారణంగా పక్షులు తమ గూళ్లను చెట్లలోనే కట్టినప్పటికీ, కొన్ని పక్షులు మనుములుండే ఇళ్ల దూలాలమీదా, చూరులలోనూకూడా గూళ్లు కడతాయి.

పక్షుల గుడ్లు పొదిగి పిల్లలు బయటికి రావటానికి వెచ్చదనం అవసరం. ఇందుకే తల్లి పక్షులు తాము పెట్టిన గుడ్లమీద కూర్చుంటాయి. సాధారణంగా ఈ పని తల్లిదే అయినప్పటికీ, ఒక్కొక్కసారి తండ్రిపక్షి గుడ్లమీద కూచుని తల్లిపక్షికి విశ్రాంతి ఇవ్వటం కద్దు.



సామాన్యంగా పక్షులలో పెంటికంటె పోతు రంగులతో అలరారుతూ, ఆకర్షవంతంగా ఉంటుంది. ఇది ప్రకృతి పక్షులకు చేసిన మేలు అయివుండవచ్చు. ఎందుచేతనంటే గుడ్ల మీద పెంటి కూచున్నప్పుడు దాని శత్రువులను అది అంతగా ఆకర్షించదు. అదే పోతుపక్షి గుడ్లమీద కూర్చుంటే దాని రంగులు శత్రువును సులువుగా ఆకర్షించవచ్చు.

ఈ కారణంచేతనేనేమో పక్షిపిల్లలు, మగవైనప్పటికీ, రంగులతో అలరారుతూ వుండవు. మగపక్షులు పెరిగి పెద్దవై ఆత్మరక్షణ చేసుకోగల దశ ఏర్పాటయే సమయానికి వాటికి ఆకర్షణీయమైన రంగులు వచ్చేస్తాయి.




సృష్టిలో సుమారు 14 వేల రకాల పక్షులున్నాయి. శాస్త్రవేత్తలు వాటిని లక్షణాలనుబట్టి ఇరవైకి పైబడిన జాతులుగా విభజిస్తున్నారు. వీటిలో ఒక జాతిని కూర్చునే పక్షులు అంటారు. పాటకు ప్రసిద్ధికెక్కిన కోయిల, బుల్‌బుల్ మొదలైన పక్షులన్నీ ఈ జాతివే.

పక్షులకు బరువులో వ్యత్యాసం చాలా ఉన్నది. కానీబిళ్ళకన్న తక్కువ తూగే పక్షి లగాయతు 300 పానులు తూగే ఉష్ట్రపక్షి దాకా పక్షుల బరువు ఉంటున్నది.

ఈ వ్యత్యాసం పక్షుల కాళ్లలో, ముక్కులలో, ఈకలలో, ఇతర అవయాలలో ఉంటుంది. పక్షులు తినే ఆహారాన్నిబట్టీ, ఆ ఆహారం దొరికే ప్రదేశాన్నిబట్టీ పక్షులు రకరకాలుగా ఉంటాయి. కొన్నిటికి ముక్కులు పొడుగు, కొన్నిటికి వాడి, కొన్నిటికి కురుచుగా వుంటాయి. అలాగే కొన్నిటికి కాళ్లు పొడుగు, కొన్నిటికి పొట్టి. కొన్నిటికి జాలపాదాలుంటాయి. కొన్నిటి పాదాలకు వాడి అయిన గోళ్ళుంటాయి. ఈ వ్యత్యాసాలన్నీ పక్షులు ఆహారం సంపాదించుకునే పద్ధతులమీదా, ఆ అహారం దొరికే ప్రదేశాలమీదా ఆధారపడినవే.



# వార్తలు-విశేషాలు

ఆంధ్రకేసరి శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు 20-వ తేదీన హైదరాబాదులోని ఉస్మానియా అనుపత్రిలో పరమపదించారు. ఆయన ప్రథమ ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రిగానే కాక, ఉమ్మడి మద్రాసురాష్ట్రానికూ కూడా ముఖ్యమంత్రి పదవి నిర్వహించారు. గత 40 సంవత్సరాలుగా ఆయన దేశస్వాతంత్ర్యానికీ, ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికీ చాలా కృషిచేశారు. వారికి ఈమధ్యనే 88 సంవత్సరాలు నిండినవి.

* * * *

**1857** లో తొలిసారిగా చెలరేగిన సాయుధ విప్లవమే మొట్టమొదటి భారత స్వాతంత్ర్య సమరం. ఈ సమరం శతవార్షికోత్సవాలు భారతదేశంలో నాలుగు చెరగులా ప్రారంభమైనాయి. అలహాబాద్‌లో సేనాపతులను ఉరితీసిన 'అమర నింబవృక్షం'వద్దకు మే 10-వ తేదిన బ్రహ్మాండమైన ఊరేగింపు సాగింది.

* * * *

సదరన్ రైల్వేలో సరకుల రవాణాను పెంచడానికిగాను ఈ యేడాది నాలుగు పథకాలను అమలుజరుపుతున్నారు. వాటిలో ఒకటి బాపట్ల—తెనాలిమధ్య 26 న్నర మైళ్ళ పొడవున జంట రైలు మార్గం ఏర్పాటు. ఇందుకుగాను 122 లక్షలు ఖర్చు కాగలదని అంచనా. ఈ ఏడాది ఖర్చుకింద 33 లక్షలు కేటాయించబడ్డాయి.



భోపాల్‌లో నిర్మాణమవుతున్న 25 కోట్ల ఎలెక్ట్రిక్ పరికరాల ప్రాజెక్టు డిప్యూటీ చీఫ్ ఇంజనీరు శ్రీ రామానుజం ఇలా చెప్పారు: "ఆధునిక యంత్ర సౌకర్యాలు ఎన్ని ఉన్నా, 2000 సంవత్సరాల క్రితం స్థాపించబడిన అశోక స్తంభానికి వాడిన ఉక్కును తయారు చేయటం సంభవం కాలేదు. ఎట్టి సౌకర్యాలూ లేని ఆ కాలంలో ఇంతటి శ్రేష్ఠమైన ఉక్కును తయారుచేసిన ఇంజనీర్లకు మనం జోహారు లర్పించాలి."

*  *  *  *

26 లక్షల రూపాయల ఖర్చుతో సహకారశిక్షణ సౌకర్యాలను విస్తరింపజేయడానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నిశ్చయించింది. రాష్ట్రంలో ప్రస్తుతం నాలుగు సహకార శిక్షణసంస్థలు— హైదరాబాద్, అనంతపురం, రాజమండ్రి, తిరుపతి పట్టణాలలో ఉన్నవి.

*  *  *  *

నిరుడు భారతప్రభుత్వం నెలకొల్పిన నేషనల్ బుక్‌ట్రస్ట్ ట్రస్టీల బోర్డుకు చెయిర్మనుగా శ్రీ సి. డి. దేశ్‌ముఖ్ నియమింపబడ్డారు. చెయిర్మను గాక 15 మంది సభ్యులున్నారు. ఈ బోర్డు ఉత్తమ సాహిత్య ప్రచురణను ప్రోత్సహించి, అలాటి పుస్తకాలు సరసమైన ధరలకు ప్రజలకూ లైబ్రరీలకూ విద్యాసంస్థలకూ లభించేటట్టు చూస్తుంది.

*  *  *  *

ఆంధ్ర నాటకసంఘ సమాఖ్య అధ్యక్షులు శ్రీ కొప్పరపు సుబ్బారావుగారు మే 3-వ తేదీన కాలధర్మం చెందారు. వీరు రోషనార, తారాశశాంకం, నూర్జహాన్, వసంతసేన మొదలైన నాటకాలను రచించారు.

*  *  *  *

టైము ఎంతయిందో చెప్పే ఆటోమాటిక్ గడియారాన్ని మద్రాస్ సిటీ సిస్టమ్‌లో ఏర్పాటు చేయడానికి నిశ్చయమైంది. టెలిఫోనుద్వారా సెకన్లతోసహా సరిగ్గా టయిమ్ తెలుసుకోడానికి ఇందువల్ల వీలవుతుంది. ఢిల్లీలో ఈ ప్రయోగం ఫలప్రదమైంది. కనుక మద్రాసు, కలకత్తా, బొంబాయి, నాగపూర్, కాన్పూర్ నగరాలలో కూడా వీటిని త్వరలోనే ఏర్పాటుచెయ్యాలని నిర్ణయం జరిగింది.



# చిత్ర కథ





దాసూ, వాసూలు ఒక రోజున 'టైగర్'ను వెంటబెట్టుకుని, విమానాశ్రయానికి వెళ్లారు. ఆ సమయంలో విమానం దిగివస్తున్న ఒక ప్రయాణీకుడి కాలిచెప్పు వూడింది. అతడు దాన్ని తిరిగి తొడుక్కునేంతలో, 'టైగర్' దాన్ని నోట కరుచుకుని, పరిగెత్తింది. ప్రయాణీకుడి కేకలువిన్న విమానాశ్రయ అధికారి ఒకడు, 'టైగర్'ను పట్టుకుని, చెప్పును పరీక్షించాడు. దానిలోపల రహస్యంగా దాచబడిన బంగారం బయటపడింది. అధికారి 'టైగర్'నూ, దాసూ వాసూలనూ మెచ్చుకుని, ప్రయాణీకుడిని, పోలీసులకు ఒప్పచెప్పాడు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26.—Controlling Editor : SRI 'CHAKRAPANI'

## చందాదారులకు మనవి



పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోష్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీ లోగా మాకు తెలియపర్చ గోరుతాము. అ పైబడి వచ్చు కంప్లైయింట్లు, గతనెలలో చేర లేద నే కంప్లైయింట్లు గమనించబడవు.

మేనేజరు







Tushar

Photo by T. S. Satyan



బహుమతి
పొందిన వ్యాఖ్య

....బయలులో నీరు మేలు....

పంపినవారు :
కె. ఎస్. ఎన్. మూర్తి - మద్రాసు

